










ఆరెంజ్ □ పైనాపిల్ □ లైమ్ □ షాహీ గులాబ్ □ కాలా ఖట్టా □ కూల్ ఖస్ □ కేసర్ ఇలైచి □ మసాలా సోడా (జల్ జీరా) □ టూటీ ఫ్రూటీ □ మేంగో రైప్ □ గ్రేప్ గ్లోరి

# తాజాదనం చిందించే రస్న

11 పసందైన రుచులు సరసమైన ధరలో.

Mudra:A:EAMR:4570 Tel




# CHANDAMAMA PUBLICATIONS

188, N. S. K. SALAI, VADAPALANI, MADRAS - 600 026, INDIA.
Phone: 423423, 421778 Grams: "CHANDAMAMA" Telex: 041-347


ప్రియమైన పాఠకులకూ, శ్రేయోభిలాషులకూ—

నమస్కారం. చందమామను మీరు ఎల్లప్పుడూ ఎంతో ప్రేమాభిమానాలతో ఆదరిస్తున్నందుకు కృతజ్ఞతలు. యువహృదయాలలో ఆరోగ్యకరమైన పఠనాసక్తిని పెంపొందించడానికి మేము మా శాయశక్తులా కృషి చేస్తున్నాము. అద్భుతమైన మన సాహిత్య, సంస్కృతి సంపదలపట్ల ఆసక్తి కలిగించే కథలను సులభమైన భాషలో అందజేస్తున్నాము. లోకజ్ఞానం పెంపొందించే విషయాలను వివిధ శీర్షికలలో అందజేస్తున్నాము. కథల ప్రమాణం విషయంలో మేమెన్నడూ రాజీపడలేదు. అయితే, ఇటీవల వాడుతూన్న కాగితం నాణ్యతలో వచ్చిన మార్పును మీరు గమనించి వుంటారు. దీనికి కారణం ఆకాశాన్నంటే కాగితం ధర. మన జాతీయజీవనంలో దేశభక్తి, నీతి, నిజాయితీల విలువలు ఎంతవరకు పెరిగాయో తెలియదు గాని, కాగితం ధర మాత్రం విపరీతంగా పెరిగిపోయింది!

కొంత తక్కువ ధరకు, అవసరానికి తగినంతగా లభించే గ్లేజులేని స్టాండర్డ్ న్యూస్‌ప్రింటు కాగితం ఉపయోగించడం మీకు కాస్త ఆశాభంగం కలిగించి వుండవచ్చు. అయినా, పత్రిక ధరను అదుపులో ఉంచడానికి ఈ మార్పు అనివార్యమయింది. ఇతర పత్రికల ధకలు ఎలా పెరిగాయో మీరు గమనించే వుంటారు. చందమామకు, మనం మళ్ళీ గ్లేజుపేపర్ ఉపయోగించాలంటే ధరను రెట్టింపు చేయవలసి వస్తుంది. అయితే, పైపై మెరుగులకన్నా, లోపలి విషయం ముఖ్యమని నా అభిప్రాయం. అందుకే, కథల నాణ్యతనూ, లోపలి విషయాలనూ మరింత మెరుగుపరచడంలో ఏమాత్రం ఉత్సాహం కోల్పోకుండా కృషి చేయగలమని మనవి చేస్తున్నాను. నా అభిప్రాయంతో మీరూ ఏకీభవించగలరని విశ్వసిస్తున్నాను.

తమ విశ్వసనీయుడైన,

ప్రచురణకర్త














# MAGGI® క్లబ్ 1989కి వినోదం మరియు ఉత్తేజం

మేగీ క్లబ్ యీ ఏడాది మేగీ ప్రేమికులందరికి కొత్త బహుమతులు తీసుకువస్తోంది.

## మీ బహుమతులను ఉచితంగా పొందండి!

5 ఖాళీ మేగీ నూడల్స్ సంచీలపైన గల
యీ మేగీ కత్తిరించి. మీరు ఎంచుకున్న ప్రతి ఒక ఉచిత బహుమతి పొందేందుకు
వాటిని మాకు పంపించండి. అంతే. 6 నుంచి 8 వారాలలో మీకు మేగీ క్లబ్ నుంచి వినోదంతో నిండిన.
ఉత్తేజకరమైన మీ బహుమతి మీకు అందుతుంది.

మర్చిపోకండి

మీరు మేగీ క్లబ్ సభ్యులైన పక్షంలో. ప్రతిసారి మాకు పత్రం వ్రాసినప్పుడు. మీకు కావలసిన బహుమతి పేరుతోబాటు మీ పేరు. చిరునామా. సభ్యత్వపు నంబరు పంపించండి.

మీరు మేగీ క్లబ్ సభ్యులు కాని పక్షంలో మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతి పేరుతోబాటు మీ పేరు. చిరునామా పంపించండి.




HTA 6320 TEL

మా చిరునామా : ద మేగీ క్లబ్ పి.ఓ. బాక్స్ నం. 5788, న్యూ ఢిల్లీ 110055

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.



6 మాసాలు నించి



4 మాసాలు నించి



6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008


Nestlé

**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

RK SWAMY/FSL/5112/TEL




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''బిచ్చన్నకథ'']కు ఆధారం, ''వసుంధర'' రచన. కొందరు స్వార్థపరులు తమ వాక్చాతుర్యంతో మంచిని చెడుగానూ, చెడును మంచిగానూ చూపి, అమాయకులైన సామాన్య ప్రజలను సులభంగా మెప్పించి తమ ప్రయోజనాలను సాధించుకోగలరు. ఇందుకు ''కోలాహలుడి ఆత్మగౌరవం'' కథ చక్కని ఉదాహరణ.

## అమరవాణి

శాస్త్రాణ్యధీత్యాపి భవంతిమూర్ఖా, యస్తు క్రియావాన్ పురుషః స విద్వాన్,
సుచింతితం చౌషధమాతురాణాం, ననామ మాత్రేణ కరోత్య రోగమ్.

[శాస్త్రాలు ఎన్ని చదివినా, వాటి కనుగుణంగా నడుచుకోనివాడు మూర్ఖులే. శాస్త్రజ్ఞానానికి అనుగుణంగా ప్రవర్తించేవాళ్ళే విద్వాంసులు. ఔషధ సేవద్వారా వ్యాధి నయమవుతుంది గాని, ఔషధం పేరు చెబుతూన్నంతమాత్రాన రోగం నయం కాదు కదా!]

సంపుటి 84    జూన్ '89    సంచిక 6

విడి ప్రతి : 3-00  : :  సంవత్సర చందా : 36-00



# హెచ్చరిక



చందమామ విజయా కంబైన్స్
మద్రాసు - 26

పై సంస్థ పేరిట 'చందమామ' పత్రికలో ప్రచురింపబడిన కథలను, సీరియల్స్‌నూ తీసుకొని, విడియో పత్రికలుగాను, టెలివిజన్ సీరియల్స్, టెలిఫిల్మ్స్‌గానూ పలుభాషలలో నిర్మించడానికి—మేము 'చందమామ' పత్రిక నిర్వాహకుల వద్ద నుంచి సర్వహక్కులూ పొందియున్నాము. పథకాలను సిద్ధం చేసుకొని నిర్మాణం ఆరంభించబోతున్నాము. అందువలన, 'చందమామ' పత్రికలోని కథలనుగాని, సీరియల్స్‌నుగాని, యథాతథంగా తీసుకోవడమో, అనుకరించడమో, వాటిల్లోని భాగాలను, లేదా సంఘటనలను లేదా పాత్రలను సంగ్రహించి, వాటిని సినిమాల్లోగాని, నాటకాల్లోగాని, విడియో, టి. వి. సీరియల్స్, టి. వి. నాటికల్లోగాని ఎవరైనా, ఏ రూపంలోనైనా ఉపయోగించినట్లయితే, చట్టప్రకారము మేము తీసుకునే చర్యకు బాధ్యులగుదురని, ఇతదుమూలంగా హెచ్చరిస్తున్నాము.

—ప్రొప్రయిటర్స్: చందమామ విజయా కంబైన్స్

# ప్రధానవక్త

ఒకసారి పాంచాలరాజు, పాండ్యరాజుకు తమ రాజ్యంలో జరిగే సభకొక ప్రధానవక్తను పంప మని కబురు చేశాడు. అలా వచ్చే వక్తను చిన్నబుచ్చి పంపాలని, పాంచాలరాజు దురుద్దేశం.

ఇది గ్రహించిన పాండ్యరాజు, తన మంత్రిని, "ఎవరిని పంపితే బావుంటుంది?" అని అడిగాడు.

"ఇంకెవరు, మహారాజా! మన విదూషకుడే అందుకు సమర్థుడు," అన్నాడు మంత్రి.

విదూషకుడు గొప్ప పండితుడు కాకపోయినా, ఎంతో సమయస్ఫూర్తికలవాడు; మంచి వక్త.

"మరేంలేదు, మహారాజా! ఆయన అవసరం అనుకుంటే, ఎదుట ఒక శ్రోత వున్నా లేక పోయినా, గంటలతరబడి మాట్లాడగలడు. అలా మాట్లాడడం, ఆయనకు చేతనయినంతగా, మన రాజ్యంలో మరెవరికీ చేతకాదు," అన్నాడు మంత్రి తాపీగా.

విదూషకుడు పాంచాలరాజ్యానికి వెళ్ళి, తన వాగ్ధోరణితో సభికులతోపాటు, రాజునూ ఆశ్చర్యంలో ముంచి తిరిగి వచ్చాడు.

ఆటు తర్వాత, అలాంటి ఆహ్వానాల బెడద పాండ్యరాజుకు కలగలేదు.

—డా॥ కాటిచెర్ల గురురామప్రసాద్





# ప్రాణమిత్రుడి సలహాలు

తండ్రి మరణంతో యువకుడైన సూర్యకాంతుడు, స్వర్ణముఖి రాజ్యానికి రాజయ్యాడు. అతడు అతి స్వల్పకాలంలోనే మంచి పరిపాలకుడుగా పేరు తెచ్చుకున్నాడు. అతడికి సుమంతుడనే ప్రాణమిత్రుడుండేవాడు. సూర్యకాంతుడు పరిపాలన విషయాలలో మంత్రి ధర్మచరణుడి సలహాలు తీసుకునేవాడు. సొంత విషయాలను మాత్రం సుమంతుడితో చర్చించి, అతడి సలహాలు పాటించేవాడు.

ఒకనాడు సూర్యకాంతుడు వేటకు బయలుదేరాడు. ఆ సమయంలో రాణి విద్యాధరి అతడితో, "ప్రభూ, యీ రోజు నా జన్మదినం. త్వరగా వచ్చేయండి!" అని ప్రత్యేకంగా చెప్పింది.

అయితే, వేట తమకంలో పడి సూర్యకాంతుడు, విద్యాధరి జన్మదినం గురించి మరచిపోయి, ఆలస్యంగా అంతఃపురం చేరాడు. ఇందుకు విద్యాధరి భర్త మీద అలిగింది. ఏం చేయాలో తోచని సూర్యకాంతుడు, సుమంతుడిని సలహా అడిగాడు.

"మిత్రమా, స్త్రీలు అలకతో మగవాడి మీద ఆధిపత్యం సంపాదించాలని చూస్తారు. ఇటువంటి వాటిని మనం ఆదిలోనే అరికట్టాలి. అలా కాక మనం బతిమిలాడడం ప్రారంభిస్తే, ప్రతి స్వల్ప విషయానికీ అలగడం మొదలు పెడతారు. నీవు మౌనంగా ఊరుకో. దానితో రాణి తనంతటతానే దిగివస్తుంది. దీనితో నీ మనస్తత్వం గ్రహించిన రాణి, మరెన్నడూ అలగదు," అని సలహాయిచ్చాడు.

సూర్యకాంతుడికి, సుమంతుడి సలహా నచ్చింది. విద్యాధరితో మాట్లాడకుండా ఊరుకున్నాడు. విద్యాధరి రెండు రోజులు చూసి, భర్తను పలకరించి, "మీ మనసు నొప్పించివుంటే క్షమించండి!" అన్నది.

ఎస్. శివనాగేశ్వరరావు



''మాట యిచ్చానుగదా, చేయిస్తాను,'' అన్నాడు సూర్యకాంతుడు.

''మిత్రమా, కోరికలకు ఒక హద్దంటూ వుండదని తెలిసిందేగదా! ఒక కోరిక తీరిస్తే, స్త్రీలు మరొక కోరిక కోరుతారు. అందువలన విలువైన వజ్రాలకోసం నువ్వు ప్రయత్నించడం వృథా. ఏదో మామూలు వజ్రాలతో హారం చేయించి యివ్వు. నీ మనసు గ్రహించిన రాణి, మరెన్నడూ యిటువంటి కోరికలు కోరదు,'' అని సలహా యిచ్చాడు సుమంతుడు.

సూర్యకాంతుడు అలాగే చేశాడు. విద్యాధరి మనసు చిన్నబుచ్చుకుని, భర్తను ఏ కోరికా కోరగూడదని నిశ్చయించుకున్నది.

సూర్యకాంతుడు, సుమంతుడు చెప్పినట్టే జరిగినందుకు చాలా సంతోషించాడు.

కొంతకాలం గడిచాక విద్యాధరి గర్భవతి అయింది. సూర్యకాంతుడు, ఆమెతో, ''విద్యాధరీ, యీ శుభసందర్భాన, నీకేం కావాలో కోరుకో!'' అన్నాడు.

అందుకు విద్యాధరి, ''అరుదుగా లభ్యమయ్యే వెలలేని వజ్రాలతో, ఒక హారం చేయించండి,'' అన్నది.

ఇందుకు సూర్యకాంతుడుసరేనన్నాడు.

ఇది విన్న సుమంతుడు, సూర్యకాంతుడితో, ''అయితే, రాణీ కోరినట్టు వజ్రాలహారం చేయించదలిచావా?'' అని ప్రశ్నించాడు.

ఒక పర్యాయం సూర్యకాంతుడు, కొందరు స్నేహితులతో కలిసి పాచికలాడుతూండగా, రాణీ చెలికత్తె వచ్చి, ''మహారాజా, రాణీగారు శిరోవేదనతో బాధపడుతున్నారు. మిమ్మలను రావలసిందిగా కోరారు,'' అని చెప్పింది.

ఇది విన్న సూర్యకాంతుడు వెళ్ళబోతూండగా, సుమంతుడు అతడి చెవిలో, ''మిత్రమా, స్త్రీలు తమమీద భర్తకున్న ప్రేమ ఏపాటిదో తెలుసుకోవడానికి, అప్పుడప్పుడూ యిటువంటి పరీక్షలు పెడుతుంటారు. కొంచెం సేపాగి వెళితే సరిపోతుంది,'' అని చెప్పాడు.

ఈ సలహా నచ్చిన సూర్యకాంతుడు, చెలికత్తెతో, "కొంచెం ఆగివస్తానని చెప్పు." అని పంపించివేశాడు.

భర్త వెంటనే వస్తాడని భావించిన విద్యాధరి, చెలికత్తె చెప్పినది విని, తీవ్రమైన మనస్తాపం చెందింది. ఆమె బాధ గమనించిన చెలికత్తె, "మహారాణీ! మహారాజు వెంటనే బయలుదేరబోయారు. అయితే, ఆయన మిత్రుడు సుమంతుడు చెవిదగ్గిర ఏదో గుసగుసలాడడంతో, మహారాజు మనసు మార్చుకున్నారు," అన్నది.



చెలికత్తె యిలా చెప్పగానే విద్యాధరి, గతంలో జరిగిన సంఘటనలలో కూడా, సుమంతుడి ప్రమేయం వుండివుంటుందని భావించింది.

ఆమె వెంటనే మంత్రి ధర్మచరణుడికి కబురు పంపింది. అతడు రాగానే, "మంత్రివర్యా, మహారాజు స్వవిషయాలకు సంబంధించి మమ్ములను సలహా అడుగుతుంటారా?" అని ప్రశ్నించింది.

"అలాంటి దేమీ లేదమ్మా! మహారాజు తన మిత్రుడైన సుమంతుడితోనే స్వవిషయాలు చర్చిస్తారు; సలహాలు తీసుకుంటారు," అని చెప్పాడు, ధర్మచరణుడు.

దీనితో విద్యాధరికి, భర్త అర్థరహితంగా ప్రవర్తించడానికి కారణం, సుమంతుడని తెలిసిపోయింది.

విద్యాధరి, సుమంతుడి కుటుంబం గురించి వివరాలు సేకరించింది. సుమంతుడిభార్య పెంకెఘటం. భర్తమాటవినదు. ఆమెను సరైనదారిలో పెట్టడానికి సుమంతుడు, ఆమెతో కఠినంగా ప్రవర్తిస్తూంటాడు. సుమంతుడికి ఇద్దరు కొడుకులు. ఒకడు తుంటరి; మరొకడు మంచివాడు.

ఒకనాడు విద్యాధరి, భర్తతో, "ప్రభూ, నే నలిగితే బ్రతిమలాడాలనివున్నా, మీరు మౌనంగా వుండడానికీ, నేనడిగితే గొప్ప విలువైన వజ్రాలహారం చేయిస్తానని మాట యిచ్చి కూడా, అతి సాధారణమైనహారం చేయించడానికీ, నాకు ఆరోగ్యం బాగుండకపోతే మీరు అదుర్గాచెందినా, అది బయటికి




కనబరచకుండా వుండడానికి కారణం, ఎవరో మీకిచ్చిన సలహాలేనని, నా అభిప్రాయం. నిజమేనా?'' అని అడిగింది.

ఆ మాటలకు సూర్యకాంతుడు ఆశ్చర్యపోయి, ''నిజమే! ఎలా గ్రహించావు?'' అని అడిగాడు.

"చాలా సులభం. నేను మీ మనస్తత్వం బాగా ఎరిగినదానిని. మీ చర్యలకూ, మనస్తత్వానికీ ఎంతో భేదం కనబడుతున్నప్పుడు, అది ఎవరో యిచ్చిన సలహా అని ఊహించాను.'' అన్నది విద్యాధరి.

సూర్యకాంతుడు, భార్య తెలివిని మెచ్చుకుని, ''నా ప్రాణమిత్రుడు సుమంతుడు యిచ్చిన సలహాలే, నా ప్రవర్తనకు కారణం. అతనేం చెప్పినా, నా మంచికే అని, నా నమ్మకం,'' అన్నాడు.

''ప్రభూ, ఒక వ్యక్తి మీద నమ్మకం ఏర్పరచుకునేముందు, అతడు ఏ సమస్యనైనా పరిశీలించి పరిష్కారమార్గం చూపగల సమర్థుడో కాదో, ఆలోచించాలి. అలా కానప్పుడు మనకు కొత్త సమస్యలు ఎదురౌతాయి,'' అన్నది విద్యాధరి.

''నువ్వు చెప్పదలచినదేదో విపరంగా చెప్పు,'' అన్నాడు సూర్యకాంతుడు.

''అయితే, వినండి! ఈసారి కలిసినప్పుడు సుమంతుణ్ణి యిలా అడగండి,'' అని, ఆ అడగవలసినదేమిటో సూర్యకాంతుడికి చెప్పింది విద్యాధరి.

ఆ సాయంత్రం సూర్యకాంతుడు ఉద్యానంలో వుండగా, సుమంతుడు అక్కడికి వచ్చాడు. సూర్యకాంతుడు, అతణ్ణి, ''మిత్రమా, నీ కిద్దరు కొడుకులని, నాకు తెలుసు. వాళ్ళ గుణగుణాలు ఎటువంటివి?'' అని అడిగాడు.

''పెద్దవాడిలో అల్లరితనం ఎక్కువ; చెప్పినమాట వినడు. రెండోవాడు బుద్ధిమంతుడు; చెప్పినమాట వింటాడు,'' అన్నాడు సుమంతుడు.

''నువ్వు చెప్పినమాట యిద్దరూ వినలేదనుకో. అప్పుడేం చేస్తావు?'' అని ప్రశ్నించాడు సూర్యకాంతుడు.

''ఏముంది, రెండు దెబ్బలుకొడితే, మొదటివాడు దారికొస్తాడు. రెండు మంచి మాటలు చెప్పి బుజ్జగిస్తే, రెండోవాడు దారికొస్తాడు.'' అన్నాడు సుమంతుడు.

సూర్యకాంతుడు ఒక్కక్షణం ఆగి, ''నీవు నాకిస్తున్న సలహాల గురించి, నా భార్య ఊహించింది. నీ పిల్లల విషయంలో తెలివిగా వ్యవహరిస్తున్న నువ్వు, యితరుల విషయంలో మాత్రం తెలివితక్కువగా వ్యవహరిస్తున్నావట! దాన్ని చక్కదిద్దుకోమని చెప్పమన్నది,'' అన్నాడు.

ఇది విన్న సుమంతుడు ఆశ్చర్యపోయి, ''నిజమే, మహారాజా! మహారాణికి, నా క్షమాపణలు తెలియజేయండి. ఇక ముందు నన్ను సలహాలు అడగకండి. మహారాణి గొప్ప మేధావి, వినయశీలి. ఆమె సలహాలప్రకారం నడుచుకోండి,'' అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

సూర్యకాంతుడు జరిగినదంతా, విద్యాధరికి వివరించి, ''సుమంతుడు, నీకు క్షమాపణలు ఎందుకు చెప్పమన్నాడో, నీ సలహా ప్రకారం ఎందుకు నడుచుకోమన్నాడో, నాకర్థం కాలేదు,'' అన్నాడు.

అందుకు విద్యాధరి చిన్నగా నవ్వి, ''ప్రభూ, సుమంతుడి భార్య పెంకెఘటం. అతని మాటవినదు. ఆమెను దారిలో పెట్టడానికి అతను, ఆమె అలిగినా బ్రతిమాలడు. నగలు అడిగినా చేయించడు. అనారోగ్యంగా వున్నా నమ్మడు. అలా చేస్తే, మరింత పెంకెతనం అబ్బుతుందేమో అని, సుమంతుడి భయం. తన భార్యవంటివారే, అందరి భార్యలూ అన్న అపోహతో, మీకలాంటి సలహాలిచ్చాడు. నా మాటగా మీరడిగిన ప్రశ్న విని, తన తప్పు గ్రహించి, నన్ను క్షమాపణకోరాడు. ఆ ప్రశ్న నేనే అతన్ని అడగవచ్చు. కాని, అభిమాన పడతాడన్న ఉద్దేశంతో, మీచేత అడిగించాను. అందుకే నన్ను వినయశీలి అన్నాడు,'' అని చెప్పింది.

సూర్యకాంతుడు చిరునవ్వు నవ్వి, ''నువ్వు చాలా తెలివిగలదానివి సుమా!'' అని భార్యను ఎంతగానో మెచ్చుకున్నాడు.





# కోలాహలుడి ఆత్మగౌరవం

మాతంగదేశపురాజు, తన రాజ్యంలో కొత్త సంస్కరణలు ప్రవేశపెట్టాలనుకున్నాడు. అందుకాయన రాజ్యాన్ని పన్నెండు సమభాగాలుగా విభజించి, ఆయాభాగాల ప్రజల అవసరాలు తెలుసుకునేందుకు, పన్నెండుగురు రాజప్రతినిధులను నియమించాడు. ఇంద్రసేనుడు అటువంటివారిలో ఒకడు. అందరిలోకీ అతడు బద్ధకస్తుడు. మిగతారాజప్రతినిధులందరూ ఊరూరా తిరిగి ప్రజల అవసరాలు తెలుసుకుంటూంటే, అతడు సదుపాయాలు బాగా వుండే మల్లపురంలో మకాంపెట్టి, వివిధ గ్రామాల ముఖ్యులకూ తనను కలుసుకోవలసిందిగా కబురు పంపించాడు.

ఆ విధంగా సీతాపుర గ్రామానికి కూడా కబురు వెళ్ళింది. ఆ గ్రామంలో నలుగురు ముఖ్యులు కబురు వింటూనే మల్లపురానికి ప్రయాణమయ్యారు. ఇది తెలిసిన వెంటనే, ఆ గ్రామంలోని కోలాహలుడనే వాడు పెద్ద గొడవ లేవదీశాడు.

''రాజప్రతినిధి స్వయంగా గ్రామాలకు వెళ్ళి, ప్రజల బాగోగులు విచారించాలి. మిగతా రాజప్రతినిధులందరూ, ఆ విధంగా చేస్తూంటే, ఇంద్రసేనుడొక్కడూ మల్లపురంలో మకాం పెట్టాడు. తానిక్కడికి రాకుండా మనల్నే మల్లపురం రమ్మనడం, ఇంద్రసేనుడి అహంకారం. ఆయన రమ్మనగానే వెళ్ళితే, అది మన గ్రామానికే అవమానం. ఇంద్రసేనుడు కదిలి ఇక్కడికి వచ్చేదాకా, మనమాయన్ని చూడవద్దు. ఆయనతో మాట్లాడవద్దు. ఈ విషయంలో తన వైఖరి మార్చుకోకపోతే, మనం ఇంద్రసేనుడి గురించి రాజుకు ఫిర్యాదు చేద్దాం.'' అంటూ కోలాహలుడు గ్రామ ప్రజలందర్నీ రెచ్చగొట్టాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

కోలాహలుడు ఆ గ్రామానికి కొత్తగా వచ్చాడు. వచ్చిన కొద్ది రోజుల్లోనే, మంచిపేరు సంపాదించుకున్నాడు. వాడి మాటలు విని గ్రామప్రజలందరూ ముఖ్యులను కలుసుకుని, ఇంద్రసేనుడి దగ్గిరకు వెళ్ళే ప్రయత్నం మానుకోమన్నారు.



ముఖ్యులు నలుగురూ కలవరపడ్డారు. రాజప్రతినిధికి కోపం వస్తుందేమోనని వాళ్ళభయం. కానీ ప్రజలందరూ ఏకమై, తమకు అవమానం అంటే కాదనేదెలా?

వాళ్ళు రాజప్రతినిధి పంపిన మనిషికి, పరిస్థితి వివరించి కోలాహలుడి గురించి చెప్పి, "ఈ పరిస్థితుల్లో మేము చేయగలిగిందేమీలేదు. అన్యథా భావించవద్దని ఇంద్రసేనుడికి చెప్పు." అన్నారు.

జరిగింది విన్న కోలాహలుడి భార్య, అతడితో, "మీరు తీరికూర్చుని రాజప్రతినిధితో గొడవ పెట్టుకుంటున్నారు. ఇంతకాలంగా యీ గ్రామంలో సుఖంగా వుంటున్నాం. ఇప్పుడేకష్టాలు పడవలసిందో ఏమిటో!" అన్నది.

"మనిషి పుట్టుకపుట్టినవాడు మనిషిలా బ్రతకాలి. అధికారంలో వున్నవాడికి బానిసలా ప్రవర్తిస్తే, ఆ బ్రతుకు బ్రతుకు కాదు. ఇంద్రసేనుడీ గ్రామానికి వచ్చి తీరాలి. అప్పుడే మన గ్రామం పేరు నిలబడుతుంది!" అన్నాడు కోలాహలుడు.

కోలాహలుడి ఆత్మాభిమానాన్ని, భార్య ఎంతగానో మెచ్చుకున్నది.

తర్వాత నాలుగు రోజులకు, మళ్ళీ ఇంద్రసేనుడి మనిషి వచ్చి, "ఇంద్రసేనుడి ఆరోగ్యం బాగోలేదు. ఆరోగ్యం బాగుండకపోయినా ఆయన మల్లపురంలో వైద్యం చేయించుకుంటూ, ప్రజల బాగోగులు విచారిస్తున్నాడు. ఆయన పరిస్థితిని అర్థం చేసుకుని, అన్ని గ్రామాల వాళ్ళూ వస్తున్నారు. ఇంద్రసేనుడు ప్రత్యేకంగా సీతాపురం గ్రామస్థులనేమీ అవమానించలేదు. అన్ని గ్రామాలవారినీ కోరినట్లే, సీతాపురం నుంచి కూడా ఆయన సహకారాన్ని కోరుతున్నాడు. ఈ విషయం

విపులంగా చెప్పడానికి కోలాహలుణ్ణి కూడా ముఖ్యులతోపాటు బయల్దేరి రావల సిందిగా కోరుతున్నాడు,'' అని చెప్పాడు.

ఈ వర్తమానం విని ముఖ్యులందరికీ, ఏం చేయాలో పాలుపోలేదు. తాము మల్లపురం వెళతామంటేనే కోలాహలుడు పెద్ద గొడవ చేశాడు. అతడినే మల్లపురం రమ్మంటే, ఆత్మగౌరవం దెబ్బతిన్నదని మరింత పెద్దగా గొడవ ప్రారంభించడా?

ఏది ఏమైనా తప్పనిసరి కావడంవల్ల, ముఖ్యులు నలుగురూ, కోలాహలుడికి కబురుపంపి రప్పించి విషయం చెప్పారు.

''అయ్యో, ఇంద్రసేనుడు అంత అనారోగ్యంగా వున్నాడని, నేను గ్రహించలేక పోయాను. అందువల్లనే, అన్ని గ్రామాల ముఖ్యులూ బయల్దేరి, ఆయన దగ్గిరకు వెళుతున్నారన్నమాట! రాజప్రతినిధి అనారోగ్యంగా వుంటే, అన్ని గ్రామాల వాళ్ళూ సహకరించి, మన గ్రామ మొక్కటే సహకరించకపోతే, అందరూ మనల్ని అనాగరికులకింద జమకట్టేస్తారు. మనం ఐదుగురం కలిసి వెళ్ళి రాజ ప్రతినిధిని దర్శిద్దాం,'' అన్నాడు కోలాహలుడు వెంటనే.

ముఖ్యులు నలుగురూ తేలికగా నిట్టూర్చారు. కోలాహలుడు గ్రామస్థు లందర్నీ కూడా ఒప్పించగలిగాడు.

తను పంపిన మనిషి తిరిగివచ్చి, సీతాపురం గ్రామ ముఖ్యులతోపాటు కోలాహలుడు కూడా రేపు వస్తున్నాడని చెప్పగానే, రాజప్రతినిధి పెద్దగా నవ్వాడు. పక్కనే వున్న ఆయన సలహాదారు ఆశ్చర్యంగా, ''అయ్యా, గ్రామానికి అవమానమంటూ గొడవ ప్రారంభించిన కోలాహలుడు, మీరు కబురంపగానే బయల్దేరడం చిత్రంగా వున్నది!'' అన్నాడు.

అందుకు రాజప్రతినిధి, ''తమ ప్రాముఖ్యతకోసం ప్రజల్ని రెచ్చగొట్టే కోలాహలుడి వంటి స్వార్థపరులు ఏనాడూ వున్నారు. వాళ్ళకొక్కావలసింది ప్రజల మేలుకాదు, నాయకులుగా ప్రభువుల గుర్తింపు పొందడం!'' అన్నాడు.






## 2

సూరయ్య బీరువా తాళాలకోసం వెతకడం సత్యం చూస్తూ ఊరుకున్నాడు.

''బీరువా తాళాలు చూడలేదుగదా?'' అన్నాడు తండ్రి తల పైకెత్తి కొడుకును చూసి.

''నేను తీసి దాచానులే,'' అన్నాడు సత్యం.

''నువు తీసి దాచటమేమిటి? నీ మొహం! ఇట్లాతే,'' అన్నాడు సూరయ్య.

''నువు నాతో మర్యాదగా మాట్లాడటం మంచిది. ఇదివరకల్లా నన్ను ఏమీ తెలియని వాజకింద కట్టేశావు. ఇకముందు నాతో మర్యాదగా మాట్లాడకపోతే నేనూరుకోను. పట్టుకు తన్నేస్తాను. తన్నటం ఇక నావంతు. నా మర్యాద మాట ఎట్లా ఉన్నా, ఇంతవాణ్ణి నన్ను పట్టుకుని నువు, ''నీ మొహం, నీమోర,'' అంటుంటే ఇంట్లో వంటలక్క దగ్గర్నుంచీ నా చెవులకు పిడకలు కట్టేస్తారు. నేనది సహించను. నా చేతనయినట్టు ఇంటి వ్యవహారాలు నేనే చూస్తాను. నాకెన్నడూ ఒక్క ఎర్ర ఏగానీ ఇచ్చి ఎరగవు. అదేమిటో ఇక ముందు నీకే తెలిసివస్తుంది. రేపటినుంచి నా బదులు నువే బడికిపోయి చదువుకో బడిపంతు లెటువంటివాడో అది కూడా నీకు తెలిసివస్తుంది,'' అన్నాడు సత్యం.

ఈ మాటకు సూరయ్య భగ్గున మండిపడ్డాడు.



కాస్త ఆలోచించి సూరయ్య, "పంతులు బాగా కొడతాడా ?'' అని అడిగాడు.

''చచ్చేటట్టు కొడతాడు. పాఠం చదివినా కొడతాడు, చదవకపోయినా కొడతాడు. 'దండం దశగుణం భవేత్' అని ఆయన సిద్ధాంతం. మన మంచికోసం కొడతాడు. తన చేతి తీట తీర్చుకోవటానికి కొడతాడు. ఏమీ తోచకపోయినప్పుడు కూడా కొడతాడు,'' అన్నాడు సత్యం.

''నన్ను పంతులు కొడితే ?'' అన్నాడు సూరయ్య దిగులుగా.

"నన్ను కొట్టినప్పుడో ? మరి, దెబ్బలు కొట్టటం దగ్గిర వెనకాడవద్దని ఆయనతో నువు చెప్పలా ?'' అన్నాడు సత్యం రోషంగా.

''యాభైఏళ్ళొచ్చి నన్నిప్పుడుపాయి రెండో తరగతి చదువుకోమంటావుట్రా ?'' అన్నాడాయన.

''చదువురాని నాకన్న చదివిన నీకు మరీ సులభంగా?'' అన్నాడు సత్యం.

''నేను బడికిపోను,'' అన్నాడు సూరయ్య ఖచ్చితంగా.

''పోకపోతే పంతులు వచ్చి పెడరెక్కలు విరిచికట్టి లాక్కుపోతాడు,'' అన్నాడు సత్యం.

''అంతపనీ చేయిస్తావుట్రా ?" అన్నాడు తండ్రి.

''నువు నన్ను చేయించినపనికాదా ?'' అన్నాడు కొడుకు.

రూపాలు మారటం అలుసు తీసుకుని తన కొడుకు తన మీద ఇట్లా పగ తీర్చుకోవటానికి ప్రయత్నించటం చూస్తే సూరయ్యకు మండిపోయింది. కాని ఏం చెయ్యటానికీ పాలుపోలేదు.

''నీ వేషాలు నేను సాగనిస్తాననుకున్నావా ? నేనెవరో నువ్వెవరో యిప్పుడే అందరికీ చెప్పేస్తాను. సులభంగా తప్పించుకుందామనుకున్నావుగామాలు," అన్నాడు సూరయ్య రోషంతో.

సత్యం బిగ్గరగా నవ్వాడు. అతని ధైర్యం హెచ్చసాగింది.

"పిలువు, యింట్లో వాళ్ళందర్నీ ఇప్పుడే పిలువు. ఏం చెబుతావో చెప్పు. నువు చెప్పిన నిజమంతా తోసేసి వాళ్ళందరూ నేను చెప్పే అబద్ధాన్ని నమ్ముతారు. ఆ సంగతి నువే కళ్ళారా చూద్దువుగాని," అంటూ సత్యం వంటలక్కని కేకపెట్టి పిలిచాడు.

వంటలక్క వచ్చింది.

"చూడు, సీతారామమ్మా, నేను సూరయ్యని. ఇడుగో వీడు సత్యం. మా ఇద్దరి శరీరాలూ మారాయి." అన్నాడు సూరయ్య వంటలక్కతో.

వంటలక్క ముక్కుమీద వేలేసుకుని, "హరి పిడుగా! నీకిదేం విపరీతబుద్ధి ?" అంటూ సత్యంకేసి చూసింది.

సత్యం వంటలక్కను చూసి నవ్వి, "సత్యం, ఆకలేసి పైత్యాన పడ్డాడు. తీసుకుపోయి తిన్నన్ని గారెలూ, ఆవడలూ పెట్టు." అన్నాడు.

"కుర్రకుంక అట్లా పేలుతుంటే మక్కెలు విరగదన్నక గారెలూ, ఆవడలూ పెట్టమన్నారా? మీ అలుసే వాణ్ణింతవరకు తెచ్చింది ?" అంటూ వంటలక్క సూరయ్యను రెక్క పట్టుకుని తీసుకుపోయింది.

వంట ఇంట్లో సూరయ్య వంటలక్కకు నిజం తెలియజేయాలని విశ్వప్రయత్నం చేశాడు. కాని లాభం లేకపోయింది. ఆ తరవాత ఇంట్లో పనిచేసేవాడితో కూడా మాట్లాడాడు.





మాట్లాడకుండా ఊరుకో. జరిగేదేమిటో జరగనీ," అని సలహా చెప్పాడు.

వంటలక్కకి పిల్లవాడి మీద జాలి కలిగింది. యిప్పుడా పిల్లవాడు తన యజమాని అయిన సూరయ్యేనని ఆవిడకు తెలీదు. "పాపం, పసివాడు కడుపునొప్పి వంకపెట్టి బడి ఎగకొడితే తండ్రి వాడికి ఫలహారం లేకుండా చెయ్యాలా? వాడికేదైనా ఒక ముక్క పెడదామన్నా పెద్దాయన పెళ్ళికూతురల్లే పైకి వెళ్ళి కూచున్నాడు. బయటికిపోడు," అనుకున్నది.

ఇంతలో వంటలక్కకు ఇంట్లో బియ్యమూ, యితర సామానులూ కావాలనేది జ్ఞాపకం వచ్చింది. అందుచేత ఆవిడ పైకి వెళ్ళి తన యజమానితో, "పొద్దుననగా బియ్యం తేవాలని చెప్పాను. ఇంకా తీసుకురాలేదు. బియ్యంతోపాటు మిగిలిన వస్తువులన్నీ తెచ్చి పడెయ్యండి. ఇవాళో రేపో తేవలిసినవే," అన్నది.

"ఒరే వీరాయ్, నేను మీ యజమానినిరా. సూరయ్యను," అన్నాడు సూరయ్య.

వీరాయి కన్నుమలిపి, "అందుకు సందేహమేమిటి దొరా?" అన్నాడు.

"నిజంగారా!" అన్నాడు సూరయ్య.

వీరాయి మరింత విశాలంగా నవ్వి వెళ్ళిపోయాడు.

సూరయ్యకు మతి పోయినట్టయింది. ఎవరూ తనమాట నమ్మకపోగా తను అన్న మాటలు తన కొడుకుతో చెప్పేశారు.

ఆ రాత్రి సత్యం సూరయ్యతో, "నువ్వు తొందరపడి అందరితో టీ జరిగింది చెప్పెయ్యకు. వెర్రెత్తిందని అందరూ నిన్ను వైద్యశాలకు పంపమంటారు.

ఈమాట వినగానే సూరయ్య రూపంలో ఉన్న సత్యం, "హి, హి, హి," అని నవ్వాడు. తరవాత నవ్వు అపుకుని, "ఓ, అలాగే తెస్తాను," అన్నాడు. ఎంతో గంభీరంగా వుండే సూరయ్య ఇట్లా నవ్వటమూ, పసిపిల్లవాడల్లే మాట్లాడటమూ వంటలక్కకు వింతగా తోచింది. కాని, దాన్ని గురించి ఆవిడ ఆలోచించలేదు. సత్యం

కుర్చీలో నుంచి లేచి తన జేబులో వున్న తాళపుచెవులతో బీరువా తెరిచి అందులో వున్న డబ్బంతా చాలాసేపు ఎంచుకుని, చాలా డబ్బు జేబులో పెట్టుకుని బయటికి బయలుదేరాడు.

తన యజమాని గడపధాటగానే వంటలక్క, "సత్యం, సత్యం!" అని పిలిచింది. కాని ఎక్కడా సత్యం అలికిడిలేదు. తండ్రి ఇంట్లోలేని సమయాల్లో సత్యం ఎక్కడున్నా చుట్టుపక్కల ఇళ్ళకు కూడా సందడిగా వుండేది. అటువంటిది ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

"సత్యం, సత్యం," అంటూ వంటలక్క యిల్లంతా వెతికింది. చివరకు సత్యం వాళ్ళ నాన్నగారి గదిలో బల్ల ముందర పెద్ద కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఎన్ని పిలిచినా పలకవేం?" అన్నది వంటలక్క.

సూరయ్య ఉలిక్కిపడి, తల ఎత్తి చూసి, "నన్నిట్లా వేధిస్తావెందుకు? పోయి నీ పని చూసుకో," అన్నాడు.

"నే చెబుతున్నా, ఇది నీ మంచికి రాలేదు. రానురాను నీకు ఈడుమించిన మాటలూ, వేషాలూ వస్తున్నాయి," అంటూ వంటలక్క లోపలికి వెళ్ళి, ఒక పళ్ళెంలో గారెలూ అపడలూ తెచ్చి బల్ల మీద పెట్టింది.

వాటిని చూడగానే సూరయ్యకు మొదట భయం వేసింది. కాని కడుపులో దహిం



చుకుపోతున్నట్టు అనిపించి ఆవురావురుమని వాటిని ఫలహారం చేసేశాడు. సూరయ్య నీరసమంతా పోయింది. కడుపులో నొప్పి రాకపోగా వొంట్లో ఎంతో ఉత్సాహం వచ్చింది.

తనలో కలిగిన మార్పు గురించి ఈ క్షణంవరకూ సూరయ్యకు విచారమే కలుగుతూ వచ్చింది. కాని ఇప్పుడు ఇందువల్ల కొన్ని మేళ్ళు కూడా కనిపించసాగాయి. ఎన్నాళ్ళనుంచో బాధిస్తున్న అజీర్తి బాధ విరగడయిపోయింది. కొంతకాలంపాటు హాయిగా యిష్టం వచ్చినట్లా తినవచ్చు. శరీరం తేలికయింది. కనక చక్కగా ఎగరవచ్చు. కొంతకాలంపాటు వ్యవహార చిక్కులు కూడా వొదిలించుకుని తిరగవచ్చు. ఈ విషయాలన్నీ చూసుకుని సూరయ్య కొంతవరకు సంతోషించాడు.

సత్యానికి కూడా తన స్వరూపం మారటం గురించి విచారం తగ్గసాగింది. వాడు దర్జాగా డబ్బు జేబులో పెట్టుకుని తిన్నగా వెచ్చాల అంగడికి వెళ్ళాడు. షావుకారు సుబ్బయ్యతో ఏ విధమైన బేరమూ ఆడలేదు. వంటలక్క చెప్పిన సరుకులన్నీ కూలివాడి నెత్తిన ఎత్తించుకున్నాడు. సుబ్బయ్య చెప్పినంత డబ్బు యిచ్చేశాడు. వస్తూ వస్తూ, దారిలో కొన్ని గాజు గోలీలూ, ఒక దసరా కోతిబొమ్మా కొనుక్కున్నాడు.

దారిలో అనేకమంది పెద్దవాళ్ళు కనిపించి, ''నమస్కారం, పంతులుగారూ,'' అంటూ వచ్చారు. తనకే నమస్కారం పెడుతున్నారని సత్యం మొదట గ్రహించలేదు. కాని, ఆ విషయం తెలుసుకున్నాక చాలా సంతోషించాడు. వాళ్ళందర్నీ మోసపుచ్చ గలిగినందుకు సత్యానికి నవ్వు కూడా వచ్చింది. సత్యాన్ని పలకరించిన వాళ్ళలో కొందరు వాడికి తెలిసినవాళ్ళే కాని, కొందరు బొత్తిగా కొత్తవాళ్ళు. వాళ్ళు తనను నిలబెట్టి మాట్లాడిస్తారేమో నని సత్యం చాలా భయపడ్డాడు. కాని అదృష్ట వశాత్తూ ఆ పూటకు అటువంటిదేమీ జరగకుండానే వెళ్ళిపోయింది. — (ఇంకావుంది)





# సాధువు వైద్యం

కోసలదేశపు మహారాణికి, ఒకసారి జబ్బు చేసింది. రాజవైద్యులు ఎన్ని మందు లిచ్చినా ప్రయోజనం లేకపోయింది. మహారాజుగారి బంధుమిత్రులు, అన్ని వేళలా రాణీ దగ్గిరే వుండి. ఆమెను ఓదార్చుతూండేవారు.

ఈ పరిస్థితుల్లో, హిమాలయప్రాంతాల నుంచి, ఒక సాధువు రాజధానికి వచ్చినట్టు మహారాజుకు తెలిసింది. ఆయన సాధువును ఆహ్వానించి ఆతిథ్యమిచ్చాడు. తర్వాత తన భార్య దీర్ఘవ్యాధిగ్రస్తురాలయినట్టు, సాధువుకు విన్నవించాడు.

సాధువు, మహారాణిని పరీక్షించి రాజవైద్యులతో మాట్లాడాడు. వాళ్ళు, రాణీకి వాడిన మందులన్నీ పరీక్షించాడు. తర్వాత కొంత ఆలోచించగా సాధువుకు, రాణి జబ్బు తిరుగుముఖం పట్టకపోవడానికి మూలకారణమేమిటో అర్థమైంది.

ఆయన మహారాజుతో, ''రాణీకి స్వస్థత కలగకపోవడానికి కారణమేమిటో, నాకు బోధపడింది. ఆమెకు వచ్చిన వ్యాధి చాలా విచిత్రమైనది. పాపాత్ముల గాలి సోకుతూండడంవల్ల, ఆమెకు వ్యాధి తగ్గడం లేదు. అందువలన, అటువంటి వాళ్ళు, ఆమె దగ్గిరకు వెళ్ళకుండా వుండేలా చూడండి. నేనిచ్చే మందుతో త్వరలోనే, ఆమె వ్యాధి తగ్గి కోలుకుంటుంది,'' అని చెప్పాడు.

సాధువు మాటలకు రాజు ఆశ్చర్యపోయాడు. రాణీ మీద గల అభిమానం కొద్దీ, ఆమెను పరామర్శించిపోవడానికి వచ్చేవాళ్ళలో, పాపాత్ములెవరో తెలుసుకోవడం ఎలా సాధ్యమవుతుంది ?

అయితే. సాధువు, రాజుతో చెప్పినది విన్నబంధుమిత్రులందరూ, రాణి దగ్గిరకు పోవడానికి భయపడ్డారు. రాజు కూడా,

తిరుమలశ్రీ

ఈ పాపం గురించిన అపవాదు తన మీదికి వస్తుందేమో అన్న శంకతో, తరచు రాణి దగ్గిరకు వెళ్ళడం మానుకున్నాడు.

ఆ విధంగా, సాధువు యిచ్చిన మందులు సేవించిన రాణి, వారం రోజుల్లోనే వ్యాధి తగ్గి, లేచి తిరగసాగింది.

రాజు సాధువుకు తన కృతజ్ఞతలు తెలుపుకుని, "స్వామీ, నా ఆస్థానంలో ఎందరో ఘనవైద్యు లున్నారు. రాణికి వచ్చినది అతి విచిత్రమైన వ్యాధి అనీ, ఆమెకు పాపాత్ముల గాలి తగలగూడదనీ, వారు గ్రహించలేకపోయారు!" అన్నాడు.

అందుకు సాధువు నవ్వి, "మందులు వాడడంలో, మీ ఆస్థానవైద్యులు చేసిన పొరబాటేమీలేదు. రాణీగారికి వారు యిచ్చిన మందులే, నేనూ యిచ్చాను. పాపాత్ముల గాలి సోకగూడదనడం మాత్రం, నేను చేసిన ప్రత్యేకచికిత్స!" అన్నాడు.

రాజుకు, సాధువు మాటలు అర్థం కాక, ఆయనకేసి ఆశ్చర్యంగా చూశాడు.

అప్పుడు సాధువు, "మహారాజా, ఏ రోగికైనా మందులతోపాటు, విశ్రాంతి కూడా అవసరం. ఎల్లవేళలా బంధుమిత్రులందరూ, రాణీగారి చుట్టూచేరి సానుభూతి కనబరుస్తూ, ఆమెకు విశ్రాంతి లేకుండా చేయడమేగాక, తానేదో భయంకర వ్యాధికి గురి అయ్యానన్న అనుమానం కూడా, ఆమెకు కలిగించారు. అందుకే నేను మర్మంగా, ఈ పాపాత్ముల గాలి సంగతి చెప్పడం జరిగింది. నిజానికి అలాంటిదేమీ లేదు," అన్నాడు.

"ఈపాపాత్ముల గాలి సోకగూడదన్నది, తమ కల్పన అన్నమాట," అన్నాడు రాజు.

"అవును. దానితో ఎవరికివారు, రాణిగారి కేమైనా కీడు జరిగితే, అందుకు తాము కారణం అనుకుంటారని, ఆమె దాపులకు వెళ్ళడం మానేశారు. ఆవిధంగా రాణిగారికి అవసరం అయిన విశ్రాంతి దొరికి, నేనిచ్చిన మందులు పని చేసినై. ఆమె అతి సామాన్యమైన వ్యాధికి గురి అయింది, అంతే!" అన్నాడు సాధువు.






# బిచ్చన్న కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భయంకరమైన ఈ శ్మశానంలో, నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే జాలి కలుగుతున్నది. నువ్వు దేనిని సాధించగోరి యిన్ని యిక్కట్లకు గురి అవుతున్నావో, నాకు తెలియదు. అయితే, స్వబుద్ధితో కాక, ఇతరుల సలహాలవల్ల, కార్యం సాధించాలనుకుంటే మాత్రం, నీకు తప్పక ఆశాభంగం కలిగి తీరుతుంది. అప్పుడు, నీకు సలహా యిచ్చినవాడు, నువ్వు అనర్హుడివని ఆత్మ తృప్తి పొందుతాడు. బిచ్చన్న అనే పేద వాడి విషయంలో ఇలాగే జరిగింది. వాడి కథ చెబుతాను, శ్రమ తెలియ

## బేతాళ కథలు



కుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

నాగపుర రాజధానీ నగరంలో వుండే ధర్మయ్య, స్వయంకృషితో పైకి వచ్చిన వాడు. ఆయన వృద్ధాప్యంలో ఒకసారి, తన నలుగురు కొడుకులను దగ్గరికి పిలిచి, "మీరు వేర్వేరు విద్యల్లో ప్రావీణ్యం సంపాదించారు. అది నాకు చాలా సంతోష కారణం. అయితే, మీ దగ్గిరకు వచ్చి సలహాలడిగే వాళ్ళకు, మీరిచ్చే కొన్ని సలహాలలో సందర్భశుద్ధి లోపిస్తున్నది. అనర్హులకు సలహా యివ్వక పోతే, జీవితంలో మీకే లోటూ వుండదు," అని చెప్పాడు.

ధర్మయ్య పెద్దకొడుకు రామయ్య తప్ప, మిగిలిన ముగ్గురూ, తమ తమ ఉద్యోగ బాధ్యతల కారణంగా నగరంలో వేరు వేరు చోట్ల నివసిస్తున్నారు.

ధర్మయ్య పెద్దకొడుకు న్యాయశాస్త్రం చదువుకున్నవాడు. వాడికి రాజు కొలువులో న్యాయాధికారి సలహాదారు ఉద్యోగం వచ్చింది. ఎంతో సమర్థవంతంగా, వాడు తన ఉద్యోగాన్ని నిర్వహిస్తున్నాడు.

ఒక రోజున రామయ్య దగ్గిరకు, బిచ్చన్న అనేవాడు వచ్చి తన కథ చెప్పుకున్నాడు.

బిచ్చన్న పేదవాడు. చిన్న పెంకుటిల్లు మినహా వాడికేమీలేదు. అందులో భార్య, ఒక కూతురుతో ఎలాగో కాలం వెళ్ళ బుచ్చుతున్నాడు. అయితే, ఇప్పుడు నగరంలోని గొప్ప భాగ్యవంతులలో ఒకడైన ధనగుప్తుడు, వాడి ఇల్లు కొంటా నంటున్నాడు. నేనా ఇల్లు అమ్మను మొర్రో అని వాడంటూంటే వినకుండా, "నీకు నాలుగు రోజులు గడువిస్తున్నాను. ఇల్లమ్మావా, సరేసరి! లేదా, వస్తాదుల్ని పిలిపించి నిన్నూ, నీ కుటుంబాన్నీ ఇంట్లోంచి తరిమేస్తాను," అని ధనగుప్తుడు బెదిరించి వెళ్ళాడు.

బిచ్చన్న కేంచేయాలో తోచడంలేదు.

"న్యాయాధికారికి ఫిర్యాదు చెయ్యి." అని సలహా యిచ్చాడు రామయ్య.

''న్యాయాధికారికీ, ధనగుప్తుడికీ మంచి స్నేహముంది. నాకు న్యాయం జరగదని అంటున్నారు. నువ్వే ఏదైనా ఉపాయం చెప్పి నన్ను కాపాడాలి,'' అన్నాడు బిచ్చన్న దీనంగా.

రామయ్య కాసేపాలోచించి,''న్యాయాధికారి నీకు న్యాయం చేయడనిపిస్తే, ఒక సులభమార్గమున్నది. ప్రతి మంగళవారం ఉదయం, మహారాజు సామాన్యుల గోడు వింటాడు. రేపే మంగళవారం వెళ్ళి ఆయన్ని దర్శించుకో, నీకు న్యాయం జరుగుతుంది,'' అన్నాడు.




''నాకు ధనగుప్తుడి మీద పగలేదు. పెద్దవాళ్ళతో లేనిపోని గొడవలు పెట్టుకోవడం, నాకిష్టముండదు. ఒకసారి ధనగుప్తుణ్ణి బెదిరించి చూస్తాను. ఫలితం లేకపోతే, అప్పుడే రాజు దగ్గిరకు వెళతాను. రాజు దగ్గిరకు వెళతానంటే, ధనగుప్తుడు బెదరకపోడు,'' అన్నాడు బిచ్చన్న.

''అలా అయితే సరే! కానీ ఈ రోజే న్యాయమందిరానికి వెళ్ళి, అక్కడి పుస్తకంలో నీఫిర్యాదు వ్రాయి. ఫలితం కనిపించకపోతే, మహారాజును కలుసుకుంటానని కూడా, ఆ పుస్తకంలో వ్రాసి, నీ చిరునామా యివ్వు. ఆ తర్వాత న్యాయాధికారి నుంచి, నీకు కబురొస్తుంది. ఆయన చెప్పే తీర్పుకోసం ఎదురుచూడు. ఒకవేళ ఫలితం అనుకూలంగా లేకపోతే, రాజుగారిని దర్శించవచ్చు,'' అన్నాడు రామయ్య.

బిచ్చన్న, రామయ్యకు కృతజ్ఞతలు చెప్పుకుని, అక్కణ్ణించి తిన్నగా, ధర్మయ్య రెండో కొడుకు వీరయ్య దగ్గిరకు వెళ్ళి, తన సమస్య చెప్పుకుని, ''నేను, నీ అన్న దగ్గిరకు వెళితే న్యాయానికి సంబంధించిన సలహా యిచ్చాడు. కానీ యీ లోగానే వస్తాదులు, నా ఇంటి మీదపడితే ఏం చెయ్యాలో తెలియడం లేదు.'' అన్నాడు.

వీరయ్య వెంటనే, ''వస్తాదుల గురువు భీమరాజు వద్ద, సింహబలుడనే శిష్యుడున్నాడు. వాడికి నిండా ఇరవైఏళ్ళు లేవు



కానీ, ఎలాంటి వస్తాదునైనా మట్టికరిపించగలడు. ఒక్కడూ ఒకేసారి పదిమందిని నేలకు విసరగలడు. వాడికి ధర్మం, న్యాయం ఆరోప్రాణంగా వుంటున్నాయి. నువ్వాడిగావంటే చాలు, వాడు నీకు సాయపడతాడు. వాడు మంచివాళ్ళకే సాయపడతాడని, మన మహారాజుకూ౹డా నమ్మకమున్నది,'' అని చెప్పాడు.

''నువ్వు రాజుగారి సైన్యాధిపతి వద్ద కొలువు చేస్తున్నావు కాబట్టి, ఈ సంగతి నీకు తెలుసు. నీకు తెలిసిన సంగతి చెప్పి, నాకెంతో ఉపకారం చేశావు, నీకు నా కృతజ్ఞతలు,'' అని బిచ్చన్న, రత్నయ్య దగ్గిరకు వెళ్ళాడు.

రత్నయ్య, ధర్మయ్యకు మూడో కొడుకు. వ్యాపారంలో నగర ప్రముఖుల్లో వాడూ ఒకడు. విదేశీవ్యాపారులు రాజధానికి వస్తే, రాజు వాడికి కబురు పెడతాడు. సరుకుల నాణ్యతను నిర్ణయించడంలో, లాభనష్టాలు బేరీజు వేయడంలో, మంచి చెడ్డలు నిర్ణయించడంలో, ఎదుటివారితో తెలివిగా మాట్లాడడంలో వాడి ప్రావీణ్యత మీద, మహారాజుకు అంతులేని నమ్మకమున్నది.

బిచ్చన్న వాడితో జరిగింది చెప్పి, ''నీ అన్నలు నాకు మంచి సలహాలే యిచ్చారు. కానీ బలవంతుడితో విరోధం పెట్టుకుంటే, న్యాయం మన పక్షాన వున్నప్పటికీ, ఫలితం అన్ని సమయాల్లోనూ మనకు అనుకూలంగా వుండకపోవచ్చు. అంతాకలిసి, ఆ స్థలాన్ని ధనగుప్తుడికి అమ్మమని నన్ను ప్రోత్సహించవచ్చు. ధనగుప్తుడు నాకు అయిదువేల వరహాలిస్తానంటున్నాడు. నా స్థలం ఎంత విలువ చేస్తుందో, నువ్వు చెప్పగలవు. అందుకే నీ దగ్గిరకు వచ్చాను,'' అన్నాడు.

అందుకు రత్నయ్య వాడికి, ''నీ స్థలం రాజధానీనగరం మధ్యలో వున్నది. అధమపక్షం యాభై వేలవరహాలు చేస్తుంది. వరాహశ్రేష్ఠి, నీ స్థలాన్ని అరవైవేలవరహాలకు కొంటాడు. ఆయన తన అల్లుడి

కోసం. ఆ ప్రాంతాలస్థలం కొనాలని చూస్తున్నాడు,'' అని చెప్పాడు.

బిచ్చన్న వాడికి కృతజ్ఞతలు చెప్పుకుని, బ్రహ్మయ్య దగ్గిరకు వెళ్లాడు. బ్రహ్మయ్య, ధర్మయ్య నాలుగో కొడుకు. వాడు వేదాలనూ, కావ్యాలనూ బాగా ఆకళింపు చేసుకున్నవాడు. మహారాజు వాడిని భక్తికి సంబంధించిన సందేహాలడిగి తీర్చుకుంటూంటాడు. రాజు కొలువులో వాడు, దేవాలయాలకు సంబంధించిన వ్యవహారాలు చూస్తూంటాడు.

బిచ్చన్న, బ్రహ్మయ్యకు తన కథ అంతా చెప్పుకుని, ''నా స్థలం నాకు వారసత్వంగా సంక్రమించింది. పోయేటప్పుడు మా నాన్న, ఆ స్థలాన్ని నా కూతురు పేర వ్రాశాడు. నాకు ఒక్కగా ఒకే ఒక్క కూతురు. దానికి మంచి సంబంధం చూసి పెళ్ళి చేయాలనుకుంటున్నాను. ధనగుప్తుడు, నా స్థలం మీద కన్ను వేశాడు. ఆ స్థలం తనదిగా చేసుకునేందుకు మరేమార్గమూ లేకపోతే, అయన తన కొడుక్కు, నా కూతురితో పెళ్ళి జరిపించాలనుకుంటున్నాడు. ధనగుప్తుడి కొడుకు అనాకారి. అలాంటివాడికి నా కూతుర్నెలా యివ్వగలను? కానీ, యీ పెళ్ళి తప్పేలాలేదు. నువ్వేదైనా ఉపాయం చెప్పగలవని యిలా వచ్చాను,'' అన్నాడు.

బ్రహ్మయ్య ఆలోచించి, ''రాజధానిలో ఏ వివాహం జరిగినా దానికి రాజాస్థాన పురోహితుడు సోమయాజులుగారి ఆమోద



ముద్ర వుండాలి. మామూలుగా అయితే ఆయనకు శుభలేఖ పంపడం ఆచారం. ఆహ్వానిస్తే ఆయన, ఏ పెళ్ళికైనా వస్తాడు. ఆయనకు నీ సమస్య చెప్పుకున్నావంటే, పెళ్ళి ఆపుచేస్తాడు,'' అన్నాడు.

బిచ్చన్న, బ్రహ్మయ్యకు కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే బిచ్చన్న తన కూతురిని ధనగుప్తుడి కొడుక్కిచ్చి పెళ్ళి చేశాడు. వాడు నగరానికి చివర చౌకగా స్థలం కొనుక్కుని, అందులో పాకవేసుకుని వుంటున్నాడు.

ఈ సంగతి తెలిసి ధర్మయ్య కొడుకులు నలుగురూ, ఎంతో సేపు చర్చలుజరిపి, తాము ఒక అనర్హుడికి సలహాలిచ్చామని ఆత్మతృప్తి చెందారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ధర్మయ్య కొడుకులు, తాము అనర్హుడికి సలహాలిచ్చామనుకోవడం అర్థరహితం కాదా ? బిచ్చన్న వాళ్ళ సలహాల గురించి ధనగుప్తుడికి చెప్పి, బెదిరించాడు. అయినా ధనగుప్తుడు లొంగిరాలేదు. అంటే, ఆ సలహాలు కార్యసాధనకు పనికిరాలేదనే గదా ? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ధర్మయ్య కొడుకులు, బిచ్చన్న లాంటి అనర్హుడికి సలహాలిచ్చారనేదాంట్లో సందేహానికి తావు లేదు. వాడు, రామయ్య సలహాప్రకారం రాజును దర్శించినా, వీరయ్య సలహా ప్రకారం భీమరాజు శిష్యుడైన సంహ బలుడి సాయం కోరినా, అలాగే రత్నయ్య, బ్రహ్మయ్య సలహాలను పాటించినా, ధనగుప్తుడు లొంగి వచ్చేవాడు. కాని, బిచ్చన్నకు వాళ్ళిచ్చిన సలహాలను అమల్లో పెట్టే ధైర్యం లేదు. వాడి యీ బలహీనతను గుర్తించిన ధనగుప్తుడు లాభం పొందాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






మగధదేశాన్ని ఏలే జయసింహుడు, ఒక నాటి రాత్రి అలవాటు ప్రకారం తన సలహాదారుడైన గుణనిధితో మారువేషంలో సంచరిస్తూండగా, నగరం శివార్లలో, కొందరు బందిపోటు దొంగలు వాళ్ళను అటకాయించారు.

రాజూ, సలహాదారూ దొంగల మీద కత్తులు దూశారు. అయితే, దొంగలు వాళ్ళను చుట్టుముట్టి నిరాయుధుల్ని చేశారు. వాళ్ళవద్ద ఎలాంటి ధనం లభించకపోవడంతో, దొంగలు కోపగించుకుని, దుర్భాషలాడి వదిలివేశారు.

ఆ మర్నాడు జయసింహుడు కొలువు తీరిన సభలో, దొంగలు చేసిన అవమానం తలుచుకుని దిగులుగా కూర్చున్నాడు. కొంతసేపు తర్వాత రాజు సభికులతో, ''ఈ సభలో ఎందరో మేధావులు వున్నారు. నాకొక సందేహం కలిగింది. దానికి మీరే సమాధానం చెప్పాలి: ఒక మనిషి విలువ, అతడి రూపం, వేషంబట్టి వుంటుందా? ఒకచోట గౌరవింపబడిన మనిషి, మరొక చోట అవమానింపబడతాడు. దీనికి కారణం ఏమిటి?'' అన్నాడు.

ఒక పావుగంటకాలం గడిచినా, సభికులెవ్వరూ రాజు సందేహానికి సమాధానం చెప్పేందుకు లేవ లేదు. రాజు దిగులు పోగొట్టడానికి యిదే మంచి సమయమని భావించిన గుణనిధి లేచి, ''మహారాజా, ఏ వ్యక్తి విలువ అయినా, అతడు అలంకరించిన స్థానం, అతడి వేషంబట్టి మారుతూంటుంది,'' అన్నాడు.

''మారుతూ వుంటుందని ఊరికే చెప్పడం కాదు; దృష్టాంతం చూపి నిరూపించగలరా?'' అని ప్రశ్నించాడు, రాజు.

''నిరూపించగలను, మహారాజా!'' అని గుణనిధి ఒక వస్త్రాన్ని తీసుకుని

పెంటకోట సోమినాయుడు

తలకు చుట్టుకుని, సభలో ఒకరిని, ''ఇదేమిటి ?'' అని అడిగాడు.

''తలపాగా !'' అన్నాడు సభికుడు.

అదే వస్త్రాన్ని గుణనిధి, భుజం మీద వేసుకుని, అదే సభికుణ్ణి, ''ఇదేమిటి ?'' అని ప్రశ్నించాడు.

''ఉత్తరీయం !'' అన్నాడు సభికుడు.

గుణనిధి, ఆ వస్త్రాన్ని చేతితో పట్టుకుని, ''ఇదేమిటి ?'' అని ప్రశ్నించాడు.

''తుండుగుడ్డ !'' అన్నాడా సభికుడు.

అప్పుడు గుణనిధి, రాజుతో, "చూశారా, మహారాజా ! నిజానికి నా చేతిలో వున్నది వస్త్రం. కాని, అది స్థానం మారినప్పుడల్లా, తన పేరు మార్చుకుంటూ పోయింది. మరొక నిదర్శనం చూపిస్తాను చూడండి,'' అని సభలో నుంచి బయటికి పోయి, ఒక కొయ్యముక్కను పట్టుకుని తిరిగివచ్చాడు.

అతడు, ఆ కొయ్యముక్కను, ఒక సభికుడి ముందు పెట్టి, కాలితో తన్న మన్నాడు. సభికుడు అలాగే చేశాడు. తర్వాత గుణనిధి, ఆ కొయ్యముక్కను, అక్కడే వున్న ఆస్థాన శిల్పిచేత, దేవుడి విగ్రహంలా చెక్కించాడు. ఆ పని ముగిశాక, అతడు, అదే సభికుడి ముందు, ఆ కొయ్య విగ్రహాన్ని పెట్టి, కాలితో తన్న మన్నాడు. కాని, సభికుడు లెంపలు వాయించుకుని, భక్తితో ఆ విగ్రహానికి నమస్కరించి దూరంగా వెళ్ళిపోయాడు.

గుణనిధి, రాజుతో, ''గమనించారా, మహారాజా ! దేవుడు లేనిచోటంటూ వుండదంటారు. అంటే, కొయ్యముక్కలో కూడా దేవుడున్నట్టేగదా. కాని, ఆ కొయ్యముక్క దేవుడిరూపం ధరించాకే, దాన్ని ఎవరైనా దేవుడిగా గుర్తించి పూజిస్తారు. అలాగే, రాజలాంఛనాలతో వున్న మిమ్మల్ని మహారాజుగా గుర్తించి గౌరవించే ప్రజలే, సామాన్యుడిలాగా వున్న మిమ్మల్ని గుర్తించలేక అగౌరవపరచవచ్చు !'' అన్నాడు.

గుణనిధి మాటలు, అర్థం చేసుకున్న జయసింహుడు, తృప్తిగా చిరునవ్వు నవ్వాడు. ఆయన మనసులోని దిగులు, ఆ క్షణంలోనే మటుమాయమైంది.



# చందమామ అనుబంధం—8

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### గురు హరగోవింద్

పంజాబు అమృతసర్ జిల్లా వాడలిలో 1595 వ సంవత్సరం జూన్ 14 న జన్మించిన హరగోవింద్, తన పదకొండవ యేటే శిక్కులకు గురువయ్యాడు; అయినా, ఆయన నిర్ణయాలు తీసుకోవడంలోనూ, ప్రవర్తనలోనూ ఎంతో పరిపక్వతనూ, వివేకాన్నీ కనబరచాడు.

లౌకిక, ఆధ్యాత్మిక శక్తులకు ప్రతీకలుగా ఆయన ఎప్పుడూ రెండు ఖడ్గాలను ధరించేవాడు. మొగలు చక్రవర్తితో తరచూ ఆయనకు ఘర్షణ ఏర్పడేది. ఆయన్ను గ్వాలియర్ కోటలో కొన్నాళ్ళపాటు బంధించి, ఆపైన వదిలిపెట్టారు.

1628 సంవత్సరంలో ఒకనాడాయన అమృతసర్ సమీప అరణ్యంలో వేటాడుతున్నప్పుడు, షాజహాన్ వేటకు వచ్చాడు. ఇరు పక్షాలకు మాటా మాటా పెరిగి యుద్ధానికి దారితీసింది. షాజహాన్ బృందం పరాజయం పొందింది. మొగల్ సేనలు తమపై పగ సాధించడానికి మళ్ళీ రాగలవని గురు గ్రహించాడు. తన సేనను బలపరిచాడు. రెండుమూడు సార్లు మొగలుల నెదుర్కొని ఓడించాడు. ఆ తరవాత ఆయన తన నివాసాన్ని హిమాలయ పాదతలంలోని కిరాత్‌పూర్‌కు మార్చాడు. శిక్కులలో ఐకమత్యాన్ని పెంపొందిస్తూ, జీవిత తత్వాన్ని బోధిస్తూ కాలం గడిపి 1644 మార్చ్ 3 వ తేదీ ఆయన కీర్తిశేషుడయ్యాడు.

## ఎవరాయన?

గొప్ప దేవాలయ నిర్మాణానికి రాజు ఆజ్ఞాపించాడు. పన్నెండు వందలమంది శిల్పులు, పన్నెండేళ్ళు శ్రమించి ఆ దేవాలయాన్ని అద్భుత కళాఖండంగా రూపొందించారు. అటు పోటుల సమయంలో సమీప సముద్రం ఆ ఆలయాన్ని చుట్టుముట్టింది.

ఒక్క గోపుర కలశం మాత్రమే అమర్చవలసి వున్నది. దానిని ఒక ప్రత్యేక విధానంలో అమర్చాలని భావించారు. అయినా, దురదృష్టవశాత్తు ప్రధానశిల్పి, దానిని అమర్చే సూత్రం మరిచిపోయాడు.

ప్రధాన శిల్పి కొడుకు అక్కడికి వచ్చాడు. అతడు పన్నెండేళ్ళవాడే అయినప్పటికీ, శిల్ప శాస్త్రాన్ని, ముఖ్యంగా ఆలయ నిర్మాణ విషయాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. అందువల్ల అతడు గోపురకలశం అమర్చే పద్ధతిని శిల్పులకు తెలియజెప్పాడు. అదేవిధంగా కలశ ప్రతిష్ఠ జరిగింది. అయినా, కొందరు శిల్పులు, "మనవల్ల చేతకాని పనిని, ఆ కుర్రవాడు చేశాడన్న విషయం తెలిస్తే రాజుగారు ఏమంటారో కదా," అని మాట్లాడుకోవడం ఆ పసివాడి చెవిని పడింది. అతడు బాధపడ్డాడు. ఆనాటి పున్నమిరేయి, అతడు ఆలయగోపురం మీదికి ఎక్కి, అలలతో ఘోషించే సముద్రంలోకి దూకేశాడు!

ఈ ఉదంతంలోని కుర్రవాడెవరో మీకు తెలుసా? (VIII పేజీ చూడండి)

# విజ్ఞాన వినోదం



## స్ట్రాతో 'కొరత'

సూచనలు :

కొన్ని సోడా స్ట్రాలూ, తాజా బంగాళాదుంప ఒకటి తీసుకోండి. బంగాళాదుంపలోకి 'స్ట్రా'ను దించి చూడండి. స్ట్రా వంగిపోతుంది కదూ?

ఇప్పుడు వేరొక స్ట్రాను తీసుకుని, కింది కొసను బల్ల మీద వుంచి, దానిని ఒకచేత్తో నిటారుగా పట్టుకుని, రెండవచేత్తో బంగాళాదుంపను తీసుకుని, స్ట్రా పైకొస మీద గట్టిగా కొట్టండి. స్ట్రా మీ అరచేతిలోకి దిగిపోకుండా జాగ్రత్తపడండి సుమా!

ఏం జరుగుతుంది ? ఎలా జరుగుతుంది ?

స్ట్రాను నిటారుగా నిలబెట్టి బంగాళాదుంపతో కొట్టేప్పుడు 'స్ట్రా' బంగాళాదుంపలోకి చొచ్చుకుని పోతుంది. ఆ దెబ్బ చదునుగా పడనట్టయితే స్ట్రా వంగిపోతుంది. కాస్త అభ్యసించి నట్టయితే, స్ట్రా పూర్తిగా లోపలికి వెళ్ళి దాని రెండవ కొన బంగాళాదుంప రెండవ వైపుకు వస్తుంది.

దెబ్బ సమతలంగా పడేప్పుడు స్ట్రాకు చాలినంత బలం వుంటుంది. అడుగున బల్ల ఉండడం వల్ల, స్ట్రా జరగడానికి సాధ్యపడదు. స్ట్రాకన్నా సున్నితంగా వున్న బంగాళాదుంపను దానిమీద గట్టిగా కొట్టేప్పుడు, స్ట్రా అందులోకి జొరబడుతుంది.

రెండు బంగాళాదుంపలు తీసుకుని, ఒకదాన్ని బల్లమీద వుంచి, దానిమీద స్ట్రాను నిటారుగా పట్టుకుని, రెండవ బంగాళాదుంపను స్ట్రా పైకొనమీద బలంగా కొట్టి, ఒకేసమయంలో రెండు దుంపలలో స్ట్రాను దించడానికి సాధ్యపడుతుందేమో ప్రయత్నించి చూడండి.

ఇదేవిధంగా, బంగాళాదుంపను స్ట్రాతో కొట్టడం ద్వారా స్ట్రాను అందులోకి దించడానికి సాధ్యపడుతుందేమో ప్రయత్నించి చూడండి!



ప్రపంచపు అద్భుతాలు

# చీనా మహాకుడ్యం

వ్యోమగాములు ఆకాశంలోకి దూసుకు వెళ్ళేప్పుడు, భూమిమీది కొండలూ, సముద్రాలూ, నగరాలూ పట్టణాలూ లీలగా కనిపిస్తూ, క్రమక్రమంగా కనుమరుగవుతాయి. బహుశా అలా చిట్టచివరిగా కనుమరుగయ్యే మానవ నిర్మిత కట్టడం చీనాకుడ్యం. 1,500 మైళ్ళ పొడవు (అంటే భూమి చుట్టుకొలతలో ఇరవయ్యోవంతు) గల ఈ మహాకుడ్యమే మనిషి నిర్మించిన కట్టడాలలో కెల్లా బ్రహ్మాండమైనది. దీనిలో 24,000 ద్వారాలూ, శిఖరాలూ ఉన్నాయి. దీని సగటు ఎత్తు 25 అడుగులు. కిందిభాగంలో 20-30 అడుగులూ, పైన 15 అడుగులూ వెడల్పు గల ఈ గోడమీద ఒకేసారి పలువురు రౌతులు గుర్రంమీద స్వారీ చేయవచ్చు. క్రీ. పూ. 3 వ శతాబ్దంలో షిన్‌హ్వంగ్ టీ చక్రవర్తి ప్రారంభించిన దీని నిర్మాణం, 1,700 సంవత్సరాలపాటు కొనసాగింది. మింగ్ వంశపు రాజుల కాలం (1368-1644)లో దీనికి తుది మెరుగులు దిద్దారు.

గొప్ప చారిత్రక ఘట్టాలు

# శాంతికి నవచైతన్యం కలిగించిన యుద్ధం

క్రీస్తు జననానికి మూడువందల సంవత్సరాలకు పూర్వం చంద్రగుప్తుడు మౌర్య వంశం స్థాపించాడు. ఆయన తదనంతరం కుమారుడు బిందుసారుడు రాజయ్యాడు. ఆ తరవాత ఆయన కుమారుడు అశోకుడు మౌర్య సింహాసనం అధిష్ఠించాడు. మౌర్య సామ్రాజ్యాన్ని విస్తరింపచేయాలన్న ఉత్సాహంతో యువకుడయిన అశోకుడు అనేక యుద్ధాలు చేసి, క్రమక్రమంగా అనేకానేక రాజ్యాలను వశపరచు కున్నాడు.

విజయోత్సాహంతో అశోకుడు కళింగదేశం (ఈనాటి ఒరిస్సా) మీదికి దండెత్తాడు. ఆనాడు కళింగ దేశాన్ని పాలించిన రాజెవరో తెలియదుగాని, దేశంలోని ప్రజలందరూ ఐకమత్యంగా దాడిని ఎదుర్కొన్నారనడంలో మాత్రం సందేహం లేదు. అయినా, అశోకుడికి బలమైన సైన్యం వున్నది: ఉభయపక్షాల మధ్య ఘోర సంగ్రామం జరిగింది. ఫలితంగా లక్షమందికి పైగా హతమార్చబడ్డారు. రక్తం కాలువలుగా ప్రవహించింది. లక్షాయాభై వేలమంది యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డారు. వేలాదిమంది ప్రజలు గాయపడ్డారు.

ఘోరమైన రక్తపాతం, దీనుల ఆర్తనాదాలు యుద్ధభూమిలోని శోకభీకర దృశ్యాలు అశోకుడి హృదయాన్ని ద్రవింపజేశాయి. ఆ తరవాత ఆయనెన్నడూ యుద్ధానికి పూనుకోలేదు. పైగా బౌద్ధమతం స్వీకరించి బుద్ధదేవుడు ప్రబోధించిన శాంతి, అహింసల ప్రచారానికి అంకితమయ్యాడు. ఆయన కారణంగానే బౌద్ధమతం దేశవిదేశాలలో వ్యాప్తి

చెందింది. సుప్రసిద్ధ రచయిత హెచ్. జి. వెల్స్, "చరిత్రపుటలనిండా ఎందరో, ఎందరెందరో రాజులు రారాజులు వున్నారు. వారి మధ్య అశోకచక్రవర్తి నామం నక్షత్రంలా, ఏకైక నక్షత్రంలా ప్రకాశిస్తున్నది" అన్నాడు.

కళింగ యుద్ధం, భువనేశ్వర్ నగర సమీపం దయానదీతీరంలో ధౌలి అనే చోట జరిగింది. అక్కడ వున్న ఒక చిన్న కొండమీద విశ్వమానవ ప్రేమను ప్రబోధించే అశోకుడి శాంతి సందేశం లిఖించబడి వున్నది.



## గత చరిత్రకేసి చూద్దాం



1. సుప్రసిద్ధ వనితలు ముగ్గురుని గుర్తు చేసే శిథిలమైన కోట ఏది?
2. వారెవరు?
3. ఆఖరికి మీరాబాయి ఏమయింది?
4. మరొక భక్తురాలికి కూడా అలాగే జరిగింది. ఆమె ఎవరు?
5. గౌతమబుద్ధుడికి పూర్వం, రాజ్యాన్ని త్యజించి అహింసను బోధించే గొప్ప మతాన్ని పునరుద్ధరించిన యువరాజు ఎవరు?
6. ఆయన జన్మస్థల మేది?
7. ఆకలితో మరణించిన ప్రసిద్ధ రాజెవరు?
8. ఆయన్ను ఆ గతికి గురిచేసిన వారెవరు?

(VIII పేజీ చూడండి)

## మన లోకజ్ఞానం పరీక్షించుకుందాం

1. ఊసరవెల్లి నాలుక ఎంత పొడవు వుంటుంది?
2. ప్రపంచంలో ఎక్కువగా ఉపయోగించే కాయగూర ఏది?
3. ప్రపంచంలో కెల్లా చాలా అరుదయిన మొక్క ఏది?
4. మనకు తెలిసిన జంతువులలో పూర్తిగా మూగ జంతువు ఏది?
5. ఆంగ్లభాషలో ఎక్కువగా ఉపయోగించబడే అక్షరం ఏది?
6. మన శరీరంలో ఎన్ని ఎముకలు ఉన్నాయి?
7. నాడి నిమిషానికి ఎన్నిసార్లు కొట్టుకుంటుంది?
8. ఏనుగుల నాడీ వేగమెంత?
9. ధ్రువాలలో నివసించే ఎలుగుబంటి బరువెంత?
10. నాలుగుకాళ్ళ జంతువులలోకెల్లా అతి వేగంగా పరిగెత్తే జంతువు ఏది?

(VIII పేజీ చూడండి)




1. భారతీయ మతగ్రంథాలలో పాండిత్యం గడించిన మొగల్ యువరాజు ఎవరు?
2. శివాజీ గురువయిన రామదాసు రచించిన గ్రంథం ఏది?
3. అతిప్రాచీనమైన సంస్కృత నిఘంటువు పేరేమిటి?
4. శిఖ్ఖుల మత గ్రంథం పేరేమిటి?
5. దానిని సంకలనం చేసినవారెవరు?
6. అందులో గల విషయమేమిటి?
7. భారతీయ జ్ఞానపీఠ అవార్డు ప్రథమ గ్రహీత ఎవరు?
8. ఆయన ఏ భాషలో రచన చేశాడు?
9. నాలుగేళ్ళ ప్రాయంలో తన దృష్టిని కోల్పోయిన సమకాలీన భారతీయ రచయిత ఎవరు?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: దక్షిణము

| | | |
|---|---|---|
| అస్సామీ : దక్షిణ్ | బెంగాలీ : దక్షిణ్ | ఇంగ్లీష్ : సౌత్ |
| గుజరాతీ : దక్షిణ్ | హింది : దక్షిణ్ | కన్నడం : తెంకు |
| కాశ్మీరీ : జూనుబ్ | మలయాళం : తెక్కు | మరాఠీ : దక్షిణ్ |
| ఒరియా : దక్షిణ్ | పంజాబీ : దక్షిణ్ | సంస్కృతం : దక్షిణ, అవాచి |
| సింధి : దఖ్ను | తమిళం : తెర్కు | ఉర్దూ : జునూబ్ |

## మీరు నమ్ముతారా?

* ఆదివారం అందరికీ సెలవురోజా?
* పౌర్ణమి లేకుండా ఒక్క నెలకూడా గడవదా?
* అతిపెద్దదయిన పిరమిడ్ ఈజిప్టులోనే ఉన్నదా?

కానే కాదు!

* గ్రీకులకు సోమవారం, పర్షియనులకు మంగళవారం, మహమ్మదీయులకు మామూలుగా శుక్రవారం, యూదులకు శనివారం సెలవు రోజులు.
* 1986 ఫిబ్రవరి నెల పౌర్ణమి లేకుండానే గడిచిపోయింది. ఇటువంటి స్థితి ఇరవైఅయిదు లక్షల సంవత్సరాల తరవాత మళ్ళీ ఒకసారి ఏర్పడవచ్చు.
* మొదటి శతాబ్దంలో మెక్సికోలో ఇటుకలతోనూ, మట్టితోనూ నిర్మించబడిన పిరమిడ్ వైశాల్యం 45 ఎకరాలు. దీని ఎత్తు 177 అడుగులు. ఈజిప్టులోని ఖియోప్స్ పిరమిడ్ చాలా ఎత్తయినదే (480 అడుగులు) కాని, దాని విస్తీర్ణం 13 ఎకరాలు మాత్రమే.

# సమాధానాలు

### ఎవరాయన?

ధర్మపాదుడు.

### చరిత్ర

1. చిత్తోడ్‌ఘర్.
2. రాణి పద్మిని, మీరాబాయి, ధాత్రిపన్నా.
3. ద్వారకలోని కృష్ణ విగ్రహంలో ఐక్యమైనట్టు విశ్వసిస్తారు.
4. తమిళనాడుకు చెందిన ఆండాళ్. ఆమె శ్రీరంగంలోని రంగనాథస్వామి విగ్రహంలో లీనమైపోయినట్టు చెబుతారు.
5. మహావీరుడు; క్రీ. పూ. 6 వ శతాబ్దంలో జైనమతాన్ని పునరుద్ధరించాడు.
6. వైశాలి.
7. మగధరాజు బింబిసారుడు.
8. ఆయన కుమారుడు అజాతశత్రువు.

### లోకజ్ఞానం

1. దాని శరీరం పొడవంత. ఇంకా ఎక్కువ కూడా.
2. ఉల్లిపాయ.
3. హవాయ్‌లోని ఒక దీవిలో చల్లారిన అగ్ని పర్వతముఖద్వారం వద్దకనిపించే 'సిల్వర్‌సోర్డ్' అనే ఒకరకం మొక్క.
4. జిరాఫ్.
5. 'ఇ'
6. రెండువందలా ఆరు.
7. నిమిషానికి 75 సార్లు.
8. సగటు ఆరోగ్యవంతుడికి నిమిషానికి 25 సార్లు.
9. 1000 పౌండ్ల వరకు బరువు వుంటుంది.
10. చిరుతపులి. గంటకు 70 మైళ్ళు పరిగెత్తగలదు.

### సాహిత్యం

1. దారాషుకో.
2. దాసబోధ.
3. అమరకోశం.
4. ఆదిగ్రంథ్.
5. ఐదవ గురువయిన అర్జున్‌మాల్.
6. గురునానక్, అతని వారసులు ముగ్గురు రచించిన గీతాలు; మరికొన్ని హిందూ, జైన భక్తుల గీతాలు.
7. జి. శంకర్‌కురుప్ కవి.
8. మలయాళం.
9. వేద్‌మెహతా. ఆయన అమెరికాలో ఉంటున్నాడు.



# నెహ్రూకథ–6

**1920**వ సంవత్సరం కలకత్తాలో కాంగ్రెస్ మహాసభ జరిగింది. అమెరికాలో చాలాకాలం గడిపి, అప్పుడే మాతృదేశానికి తిరిగి వచ్చిన లాలా లజపతిరాయ్ ఆ మహాసభకు అధ్యక్షత వహించాడు.

బ్రిటిష్ ప్రభుత్వంతో అన్నివిధాలా సహాయ నిరాకరణ చేయవలసిందిగా కాంగ్రెస్ ప్రకటించాలని గాంధీజీ ఆశించాడు. అయినా పలువురు నాయకులు అందుకు సుముఖత చూపలేదు. మోతీలాల్ నెహ్రూ మాత్రం గాంధీజీకి మద్దతు తెలియజేశాడు.





కాంగ్రెస్ స్వరూపలక్షణాలు వేగంగా మార్పు చెందసాగాయి. ఇప్పుడు కాంగ్రెస్ కేవలం గొప్పవాళ్ళకే పరిమితమయిన సంస్థ కాదు. మధ్యతరగతి నుంచీ, కింది తరగతి నుంచీ ప్రతినిధులు ఖాదీ ధరించి కాంగ్రెస్‌లో సభ్యులు కాసాగారు. వాళ్ళందరూ సహాయ నిరాకరణకు అంగీకారం తెలిపారు.



కాంగ్రెస్‌లో వస్తూన్న ఈ కొత్త మార్పును ఇబ్బందికరంగా భావించిన వాళ్ళలో మహమ్మదాలీజిన్నా ఒకడు. కాంగ్రెస్‌లో చోటు చేసుకుంటూన్న నవచైతన్యానికి భిన్నమైన మనస్తత్వం కలవాడాయన.

కాంగ్రెస్ మహాసభ ముగిసిన తరవాత, జవహర్లాల్, గాంధీజీని శాంతినికేతన్‌కు తీసుకువెళ్ళాడు. గాంధీజీ—రవీంద్రనాథటాగూర్‌ల మధ్య జరిగిన సమావేశం చిరస్మరణీయమైన సంఘటన. గాంధీజీ, టాగూర్‌ను (బోరోదాదా) 'అన్నయ్యా' అని సంబోధించాడు!





సహాయ నిరాకరణోద్యమం నలు దిశలా వ్యాపించింది. రెండే నెలలలో అంటే 1921 డిసెంబర్‌లోనూ, 1922 జనవరిలోనూ దాదాపు 30,000 మంది జైళ్ళపాలయ్యారు. జవహర్లాల్ కూడా ఖైదు జేయబడ్డాడు. అదే ఆయన. మొట్టమొదటి జైలు అనుభవం!

మునుముందు బ్రిటిష్ సామ్రాజ్య చక్రవర్తి కానున్న వేల్స్ యువరాజు భారతదేశ పర్యటనకుగాను విచ్చేశాడు. ఆయన కార్యక్రమాలను బహిష్కరించాలని కాంగ్రెస్ తీర్మానించి ప్రజలకు పిలుపు నిచ్చింది. బొంబాయి, కలకత్తా వంటి నగర వీధులలో యువరాజు ఊరేగింపు జరిగినప్పుడు వీధులు నిర్మానుష్యంగా కనిపించాయి.






ఆ సమయంలోనే, పోలీసులు వేధించారన్న ఆగ్రహంతో చౌరీచౌరా గ్రామం పోలీస్‌స్టేషన్‌ను గ్రామస్థులు కొందరు తగలబెట్టారు. మంటలలో కొందరు పోలీసులు మరణించారు. ఎలాంటి హింసనూ సహించలేని గాంధీజీ, బాధతో జాతీయ ఉద్యమాన్ని ఆపమని ఆదేశించాడు.

ఎక్కడో ఒక హింసాత్మకచర్య జరిగిందని, జాతీయ ఉద్యమాన్ని ఆపడం జవహర్లాల్‌కు ఇష్టం లేదు. ఇతర నాయకులు కూడా గాంధీజీ పోకడను అంగీకరించలేదు. అయినా గాంధీజీ తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు. కొన్నాళ్ల తరవాత గాంధీజీ ఖైదు జేయబడ్డాడు.





జవహర్లాల్ వరుసగా రెండుసార్లు జైలు పాలయ్యాడు. మన భారత రాష్ట్రాలలో చట్టం అమలయ్యే విధానం 1923వ సంవత్సరంలో ఆయన దృష్టిని ఆకర్షించింది. పంజాబులో నాభా మహారాజా బ్రిటిష్‌వారిచేత తొలగించబడ్డాడు. ఒక ఐ. సి. యస్. అధికారి నిర్వహణా బాధ్యత చేపట్టాడు. జైటోలో శిక్కుల మత సంప్రదాయ ఉత్సవం జరగడాన్ని ఆయన నిషేధించాడు.

దానిని వ్యతిరేకించి శిక్కులు కొందరు తమ మత సంప్రదాయాన్ని కొనసాగించడానికి జైటోకు వెళ్ళారు. వాళ్ళకు అడ్డుపడి, పోలీసులు కొట్టారు. జవహర్‌లాల్, అతని మిత్రులు—కె. సంతానం, గిద్వానీలతో కలసి అక్కడి పరిస్థితిని పరిశీలించడానికి వెళ్ళాడు.





జవహర్‌లాల్, సంతానం ఇరువురి చేతులకూ సంకెళ్ళు తగిలించి, పట్టణ వీధులగుండా నడిపించుకుని వెళ్ళారు. జవహర్లాల్ చీకటికొట్టు లాంటి జైలు గదిలో సంకెళ్ళు విప్పకుండా తెల్లవార్లూ గడిపాడు. చీకట్లో ఎలుక ఒకటి ఆయన ముఖాన్ని గాయపరచింది!

—(ఇంకా వుంది)




శిళ్ళంగేరి గ్రామంలో గోపయ్య అనే, ఒక రైతుండేవాడు. అతడికి ముగ్గురు కొడుకులు: రాజయ్య, భీమయ్య, సోమయ్య. తన కొడుకులు, తనలాగే సామాన్య రైతుల్లా జీవించడం, గోపయ్యకు యిష్టంగా వుండేదికాదు. ఆ కారణంవల్ల, అతను తన ముగ్గురు కొడుకులకూ, తలా వంద బంగారునాణ్యాలిచ్చి, పట్నం వెళ్ళి వ్యాపారమో మరేదైనానో చేసి, ధనం సంపాయించుకు రమ్మన్నాడు.

ముగ్గురూ ఆరునెలలు గడిచాక గ్రామానికి తిరిగి వచ్చారు.

గోపయ్య తన కొడుకులు బాగా ధనం సంపాయించుకు వచ్చారనుకుని, పెద్ద కొడుకు రాజయ్యను, "నీవెంత సంపాయించుకుని వచ్చావు? పట్నంలో ఏం వ్యాపారం చేశావు?" అని అడిగాడు ఎంతో సంతోషంగా.

రాజయ్య సంచీలోంచి, ఒక అద్దం బయటికి తీసి, "నాన్నా, దీనిని ఎంతో కష్టపడి సంపాయించాను. ఇది మామూలు అద్దం కాదు. ప్రపంచంలో ఎప్పుడు, ఎక్కడ ఏం జరుగుతున్నదీ, దీని సాయంతో తెలుసుకోవచ్చు. అయితే, అందుకు అవసరం అయినశక్తి, నా కొక్కడికే వున్నది," అన్నాడు.

గోపయ్య, తన రెండో కొడుకు భీమయ్యను, రాజయ్య నడిగినట్టే అడిగాడు.

భీమయ్య తన పక్కన వున్న, ఒక పంచకళ్యాణి గుర్రాన్ని అతడికి చూపి, "నాన్నా, నేనీ గుర్రాన్ని సంపాయించాను. ఇది మామూలు గుర్రం అనుకునేవు. ఇది నన్ను ఎక్కడికి కోరితే అక్కడికి సునాయాసంగా, ఒక్కక్షణంలో తీసుకు పోగలదు. ఇది నేలపైనే కాక, నీటిపైనా,

కోలార్ కృష్ణఅయ్యర్



ఆకాశంలో కూడా ప్రయాణించగల శక్తి గలది. కానీ, యిది నా కొక్కడికే చెప్పినట్టు చేస్తుంది,'' అన్నాడు.

మూడో కొడుకు సోమయ్య, నక్షత్రంలా తళతళ మెరుస్తున్న తన వేలి ఉంగరాన్ని తండ్రికి చూపి, ''నాన్నా, ఈ ఉంగరానికి ఒక అద్భుతశక్తి వున్నది. ఈ ఉంగరం నన్ను ఇతరుల కళ్ళబడకుండా అదృశ్యంగా, నేను కోరినచోటుకు తీసుకుపోగలదు,'' అని చెప్పాడు.

తన కొడుకులు, అద్భుతశక్తులుగల వస్తువులను సంపాయించుకువచ్చినా, వాటి ఉపయోగం ఏమిటో, గోపయ్యకు అర్థం కాలేదు. ఆయన, యీ సంగతి తన కొడుకులతో చెపుతూండగా, ఆ దేశపు రాజభటులు గ్రామానికి వచ్చి, ఒక చాటింపు వేశారు.

అదేమంటే—వసంతసేన, ఆ దేశపు రాజుకు ఏకైక కుమార్తె. అద్భుత సౌందర్యవతి. ఆమే రాజ్యానికి వారసురాలు. ఆమెను కొద్ది రోజులక్రితం, ఒక దుష్టమాంత్రికుడు ఎత్తుకుపోయాడు. ఆమె అచూకీ తెలుసుకుని, ఆమెను మాంత్రికుడి నుంచి రక్షించి తెచ్చిన వారికి, ఆమె నిచ్చి వివాహం చేయడమే కాక, రాజపదవిని కూడా యిస్తారు.

ఈ చాటింపు విన్న గోపయ్య కొడుకులు, తాము సంపాయించిన అద్భుత వస్తువుల సాయంతో రాకుమార్తెను రక్షించవచ్చని సంతోషించారు.

రాజయ్య అద్దం సాయంతో, మాంత్రికుడు రాకుమార్తెను ఎక్కడ దాచాడో తెలుసుకున్నాడు. వాడామెను సముద్ర మధ్యంలో వున్న, ఒక చిన్న ద్వీపంలోని గృహంలో దాచివుంచాడు. ఆ గృహాన్ని రకరకాల ఆయుధాలు ధరించిన, యమకింకరుల లాంటివాళ్లు కాపలా కాస్తున్నారు.

భీమయ్య తన గుర్రం పైన, తమ్ముడు సోమయ్యను ఎక్కించుకుని, ద్వీపంలోని గృహానికి కొంతదూరంలో గుర్రం దిగాడు. సోమయ్య తన ఉంగరం ప్రభావంతో,

అదృశ్యంగా రాజకుమార్తె వున్న గదిలో ప్రవేశించి, మంత్రదండాన్ని గాలిలో తిప్పుతూ ఆమెను బెదిరిస్తున్న మాంత్రికుడిని సమీపించి, ఒక్క కత్తివేటుతో వాడి తలను తెగవేశాడు.

తర్వాత సోమయ్య, రాజకుమార్తెతో పాటు గుర్రం దగ్గిరకు వచ్చాడు. ముగ్గురూ దాన్ని ఎక్కి, ఆకాశమార్గాన క్షణాల్లో వచ్చి, వాళ్ళ ఇంటిముందు దిగారు.

గోపయ్యకు తన కొడుకుల అద్భుత శక్తులు చూసి ఆనందం కలిగింది. కానీ, వాళ్ళ సంతోషం చూస్తూంటే, ఎవడికి వాడుగా తను రాజకుమార్తెను వివాహం ఆడి, దేశానికి రాజు కావాలనుకుంటున్నాడేమో అన్న అనుమానం కలిగింది.

గోపయ్య ముగ్గురినీ, "మీలో రాజకుమార్తెను వివాహమాడే అర్హత ఎవరికున్నదనుకుంటున్నారు?" అని అడిగాడు.

ముగ్గురూ ఒకరి ముఖం కేసి ఒకరు చూసుకున్నారు తప్ప, గోపయ్యకు జవాబివ్వలేదు.

ఇది చూసి, తన కొడుకుల మనస్సులో దురాశా, స్వార్థబుద్ధీలాంటివి చోటు చేసుకున్నవని గ్రహించిన గోపయ్య, వాళ్ళతో, "నాయనలారా, మీ ముగ్గురూ ఒకరితో ఒకరు సహకరించి, రాజకుమార్తెను మాంత్రికుడి బారినుంచి రక్షించారు. ఇది సాధించిన తర్వాత, ఇప్పుడు మీలో రాజకుమార్తెను వివాహమాడి, దేశానికి రాజు కావాలన్న స్వార్థచింతన బయలు



చేరింది. రాజుగారు తన కుమార్తెను, మీలో ఎవరికిచ్చి వివాహంచేయమంటారు, అని అడిగితే—అప్పుడు నేనే అర్హుణ్ణంటే, నేనేనని, మీరు ఒకరితో ఒకరు పోట్లాడుకునే ప్రమాదం వున్నది. అందువల్ల మీరు సాధించినదంతా నిరర్థకమైపోతుంది!'' అన్నాడు.

తండ్రి చేసిన ఈ హితబోధతో ముగ్గురు కొడుకులూ గోపయ్యను, ''నాన్నా, మాలో అర్హులెవరో మీరే నిర్ణయించండి,'' అని కోరారు.

ఆ మాటలకు గోపయ్య నవ్వి, ''నిర్ణయించవలసినవాణ్ణి, నేను కాదు. ఒక వివాహానికి వరుడు, వధువు యిద్దరి అంగీకారం అవసరం. కనుక, మీరు రాజకుమార్తెను తీసుకుపోయి, రాజుగారికి అప్పగించండి. మీలో ఎవరిని వివాహమాడ దలిచిందో, ఆమే చెబుతుంది,'' అన్నాడు.

అన్నదమ్ములు ముగ్గురూ, రాజకుమార్తెను రాజు దగ్గిరకు తీసుకుపోయి జరిగింది చెప్పారు.

రాజు, ఆమెను వారిలో ఎవరిని వివాహమాడ కోరుతున్నావని అడిగాడు.

రాజకుమార్తె బాగా ఆలోచించి, ''నాన్నా, ఈ ముగ్గురిలో జ్యేష్ఠుడు రాజయ్య. అందువల్ల అతడికి ప్రథమంగా వివాహం జరగడం ధర్మం. అంతేకాక, అతడి అద్భుతశక్తిగల అద్దం వల్లనే, నేనెక్కడ బంధితురాలినై వున్నదీ తెలిసింది. అది తెలియకపోతే, మిగతా ఇద్దరి గుర్రం, ఉంగరం శక్తులు వృథా. అందుచేత రాజయ్యను వివాహమాడ దలిచాను. భీమయ్యను సర్వసేనాపతిగా, సోమయ్యను ముఖ్యమంత్రిగా నియమిస్తే, ఏ సమస్యా వుండదు. అందరికీ న్యాయం జరిగినట్టవుతుంది,'' అన్నది.

ఆమె నిర్ణయం ముగ్గురన్నదమ్ములకూ తృప్తికలిగించింది. రాజు మహావైభవంగా కుమార్తె వివాహం రాజయ్యతో జరిపించి, అతడికి రాజ్యం అప్పగించి, భీమయ్యను సర్వసేనాపతిగా, సోమయ్యను ముఖ్యమంత్రిగా నియమించాడు.





# కృష్ణావతారం

కృష్ణుడు ప్రారంభించిన యజ్ఞం పూర్తి అయింది. అనేక వేలమంది బ్రాహ్మణులకు సంతర్పణ జరిగింది. అర్జునుడూ, సాత్యకీ మొదలైన వాళ్ళను యాభైమందిని తన పంక్తిన పెట్టుకుని కృష్ణుడు విందు ఆరగించాడు. తరవాత అందరూ సభాభవనంలో చేరి కులాసాగా కబుర్లు చెప్పుకునేటప్పుడు అర్జునుడు కృష్ణుణ్ణి, "ఇంతకూ ఆ బ్రాహ్మణుడి కొడుకులు ఎలా పోయారు? వాళ్ళను ఎవరు ఎత్తుకుపోయారు? ఎక్కడ దాచారు?" అని అడిగాడు.

"సమస్త సృష్టికీ మూలకారణమైన పరమేశ్వరుడు నన్ను చూడగోరి, బ్రాహ్మణ కార్యాన్ని నేను అలక్ష్యం చెయ్యను గనక, బ్రాహ్మణ బాలకులను మాయం చేస్తూ వచ్చాడు. ఆయన కోరిక తీర్చటానికి నేను సముద్రాన్ని పాయలుగా చీల్చి, కొండలను తోసి దారి చేసుకుని వెళ్ళవలసి వచ్చింది," అన్నాడు కృష్ణుడు.

తరవాత అర్జునుడు తిరిగిపోయి, ధర్మరాజుకు తాను చూసిన వింతలన్నీ చెప్పి, ఆయనకు సంతోషం కలిగించాడు.

ఒకనాడు రుక్మిణి కృష్ణుడితో, "నేను ప్రద్యుమ్నుడు మొదలైన పిల్లలను కన్నాను గాని, నా కింకా సంతాన కాంక్ష తీరలేదు. నీ వంటి కొడుకును ఇంకొకణ్ణి కనాలని ఉన్నది," అన్నది.

"శంకరుణ్ణి ఆరాధించి నీకు మరొక కొడుకును కంటాను. తపస్సు ద్వారా

22. కృష్ణుడి కైలాసయాత్ర



లభించనిదంటూ లేదు. హిమాలయానికి వెళ్ళి శంకరుడికి నమస్కారం చెయ్యటంతో బాటు, దారిలో బదరీవనంలో ఉండే మహాతపస్సంపన్నులను కూడా చూడాలని ఉన్నది. ఇందువల్ల అనేక శుభాలు కలుగుతాయి. కనక, నేను కైలాసయాత్ర చేసి వస్తాను,'' అన్నాడు కృష్ణుడు.

మర్నాడు ఉదయం కృష్ణుడు కాలకృత్యాలు తీర్చుకుని, సభాభవనానికి రావలసిందని బలరాముడికీ, సాత్యకికీ, ఉగ్రసేనుడికీ, కృతవర్మకూ, ఉద్ధవుడికీ, మిగిలిన యాదవ ప్రముఖు లందరికీ కబురు చేశాడు. కొద్దిసేపట్లో అందరూ సభాభవనంలో సమావేశమయారు. అప్పుడు కృష్ణుడు గంభీరంగా, వారితో ఇలా అన్నాడు:

''నేను నా విరోధులందరినీ చంపేశాను గాని, ఇంకా ఒకడు మిగిలి ఉన్నాడు. వాడు సామాన్యుడు కాడు, చాలా ధైర్య పరాక్రమాలు గలవాడు. వాడి పేరు పౌండ్రుడు. వాడికి నేనంటే పగ. నాకు వాడంటే భయం ఉన్నది. వాణ్ణి చంపితేనే గాని నేను నిజంగా విజయం సాధించాననుకోను. నా కిప్పుడు కైలాసయాత్ర చేయవలసిన పని పడింది. నేను వెళ్ళగానే పౌండ్రుడు వచ్చి మన నగరం మీద దాడి చేస్తాడు. వాడు ప్రపంచంలో యాదవు డన్నవాడు లేకుండా చేయగలిగినవాడు. అందుచేత నేను తిరిగి వచ్చేదాకా మీరు వెయ్యి కళ్ళతో అహర్నిశలు నగరాన్ని కాపాడాలి. నగరద్వారా లన్నిటినీ గట్టిగా రక్షించండి. అనుమతి లేకుండా ఎవరినీ లోపలికి రానివ్వవద్దు, బయటికి పోనివ్వవద్దు. చతురంగ బలాలనూ ఆయత్తం చేసి ఉంచండి, ఆయుధాలన్నిటినీ సిద్ధపరచండి. అన్ని దిక్కులా చక్కగా రక్షించుకోండి.''

తరవాత అతను సాత్యకితో, ''ఈ నగరాన్ని రక్షించే భారం ప్రధానంగా నీపైన ఉంచుతున్నాను. యాదవ సంపద



కంతకూ నిన్నే రక్షకుడుగా ఏర్పాటు చేస్తున్నాను,'' అని చెప్పాడు.

''నీ ఆజ్ఞా, బలరాముడి అండా ఉంటే నేను చెయ్యలేని దేమి ఉంటుంది? పౌండ్రుడేమిటి, ఇంద్రుడే దిక్పాలకులందరినీ, దేవతలనూ వెంటబెట్టుకుని ఎత్తివచ్చినా సరే నేను లక్ష్యపెట్టను,'' అన్నాడు సాత్యకి.

కృష్ణుడు ఉద్ధవుడితో, ''గురువర్యా, నువు బుద్ధికి బృహస్పతివి. నీకు నేను చెప్పటమేమిటి? పరాక్రమవంతులైన మన యాదవవీరులను నీ బుద్ధిబలంతో నడిపించు,'' అన్నాడు. అతను ఇదే విధంగా బలరాముణ్ణీ, ఉగ్రసేనుణ్ణీ, ఇతర యాదవ ముఖ్యులనూ హెచ్చరించి, గరుత్మంతుణ్ణి స్మరించాడు. వెంటనే గరుత్మంతుడు వచ్చి వాలాడు. తాను కైలాసానికి వెళ్ళాలని చెప్పి కృష్ణుడు గరుత్మంతుడి వీపు మీద ఎక్కి కూర్చున్నాడు. కృష్ణుడితో సహా గరుత్మంతుడు ఆకాశంలోకి లేచి, ఈశాన్యదిక్కుగా ప్రయాణమయాడు.

అలా బయలుదేరిన కృష్ణుడు దారిలో బదరీవనంలో దిగాడు. అక్కడ ఉండే మునులు అతనికి గొప్ప స్వాగతం ఇచ్చారు. వారి ఆతిథ్యం స్వీకరించి కృష్ణుడు ఆ రాత్రికి అక్కడే ఉండి పోయాడు. అర్ధరాత్రి వేళ అతనికి ఆ ప్రాంతమంతా సంచరించాలని బుద్ధి పుట్టింది. అతను చాలాసేపు బదరీవనమంతా సంచరించి, ఒక మనోహర ప్రదేశానికి వచ్చి, అక్కడ స్వస్తికాసనం వేసుకుని, సమాధియోగం అవలంబించాడు.

ఆ సమయంలో అటుగా అనేకవేల సంఖ్యలో పిశాచులు మృగాలను తరుముకుంటూ వచ్చారు. వాళ్ళకు నాయకులుగా ఘంటాకర్ణుడనే పిశాచి, అతని తమ్ముడూ ఉన్నారు. వాళ్ళు కృష్ణుడున్నచోటికి వచ్చి, ''ఎవరవు, బాబూ? చూడటానికి నాజూకుగా ఉన్నావు, ఈ వనంలో ఎందు

కున్నావు ? నువు రాక్షసుడివా, దేవతవా?'' అని అడిగాడు.

''నేను యదువంశ క్షత్రియుణ్ణి. దుష్టులను సంహరించటమూ, సజ్జనులకు సంతోషం కలిగించటమూ నా పని. శంకరుణ్ణి చూడటానికి కైలాసానికి వెళుతున్నాను. మీ రెవరు ? ఇది సాధుజనులుండేచోటు. ఇక్కడ, మృగాలను కూడా హింసించరాదు. మీరు మృగాలను వేటాడుతూ ఇక్కడికి వస్తే నేను సహించను,'' అన్నాడు కృష్ణుడు.

ఆ మాటకు ఘంటాకర్ణుడు, ''నా పేరు ఘంటాకర్ణుడు. వీడు నా తమ్ముడు. నేను విష్ణుభక్తుణ్ణి. ఇదంతా నా సేన. నేను కుబేరుడి కింకరుణ్ణి. విష్ణుపూజ కోసమే మృగాలను వేటాడుతున్నాం గనక, దీన్ని హింస అనకూడదు. మరొకటి చెబుతాను విను. నా ఇష్టదైవం వసుదేవుడి కొడుకుగా జన్మించి ద్వారకలో నివసిస్తున్నాడు. నేను ఇప్పు డాయనను దర్శించటానికే సేనా సమేతంగా బయలుదేరి పోతున్నాను,'' అని చెప్పాడు.

తరవాత అతను కృష్ణుడి దగ్గరలోనే పేగులు పరిచి కూర్చుని, చేతులు మోడ్చి, తన యిష్టదైవాన్ని ధ్యానించుకో సాగాడు. వాణ్ణి చూస్తుంటే కృష్ణుడికి ముచ్చట వేసింది. వాడు తన భక్తుడు, కాని చేసే పన్నీ పిశాచపు పనులు. కళ్ళు మూసుకుని ధ్యానించే ఘంటాకర్ణుడి మనోనేత్రంలో తన స్వరూపం కనబడేటట్టు కృష్ణుడు



చేశాడు. వాడు కళ్ళు తెరిచి చూసేటప్పటికి అదే రూపం కళ్ళ ఎదట కనబడింది. వాడు లేచి ఆనందపారవశ్యంతో నృత్యం చేస్తూ, ''కృష్ణుణ్ణి చూశాను! విష్ణువును చూశాను!'' అని కేకలు పెట్టాడు; కృష్ణుణ్ణి రకరకాల స్తోత్రం చేశాడు. తరవాత వాడు తన శూలానికి గుచ్చి వున్న శవాన్ని తీసి, కత్తితో రెండుగా నరికి, ''ఇది పవిత్రమైన బ్రాహ్మణుడి శవం. భక్తితో నీకు అర్పిస్తున్నాను, తీసుకో,'' అన్నాడు.

కృష్ణుడికి వాణ్ణి చూస్తే జాలి వేసింది. అతను ఘంటాకర్ణుడితో, ''చూడు నాయనా! నాబోటి వాళ్ళు పీనుగును తాకరు. ఇటువంటిపూజలు నాకు చాలా అసహ్యం కూడాను. మామూలు పిశాచాలు చేసే ఇటువంటి పనులు నీవంటి గొప్ప వాడు చేయరాదు. ఎప్పుడూ నన్నే ధ్యానిస్తూ ఉంటావు గనుక నేను నీకు ఉత్తమ లోకం ఇస్తాను,'' అంటూ, ఘంటాకర్ణుడి శరీరం తాకాడు. పరుసవేది తగలగానే ఇనుము బంగారమైనట్టుగా, కృష్ణుడి చెయ్యి తగలగానే ఆ భయంకర పిశాచి కాస్తా దివ్యపురుషుడుగా మారిపోయాడు.

త్వరలోనే రాత్రి గడిచిపోయింది. సూర్యోదయమయింది. కృష్ణుడు గంగా స్నానం చేసి, బదరీవనంలోని మునులకు వీడ్కోలు చెప్పి, గరుత్మంతుడిపై ఎక్కి కైలాసానికి బయలుదేరాడు. కైలాసం చేరవస్తూ అతను ఆ కొండమీది వివరా





ఆ మర్నాడు వృషభవాహనం మీద పార్వతితో సహా శివుడే బయలుదేరి వచ్చాడు. ఆయన వెంట పుష్పకంమీద కుబేరుడూ, తమ తమ వాహనాలమీద విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ, వాళ్ళకు ముందుగా ఆయుధాలు ధరించి నందీ, మహాకాళుడూ, వెనకగా భూతగణాలూ వచ్చారు. వారంతా పాడుతూ, నృత్యాలు చేస్తున్నారు.

కృష్ణుణ్ణి అంత దూరాన చూడగానే శివుడు పార్వతితో సహా వృషభ వాహనం దిగాడు. కృష్ణుడు కూడా శివుణ్ణి దూరాన చూస్తూనే, తన ఆసనంమీది నుంచి లేచి ఎదురు వచ్చి, ఎంతో భక్తితో తలవంచి, నమస్కరిస్తూ శివుడి కెదురుగా నిల బడ్డాడు. ఆ సమయంలో అక్కడ చేరిన దేవత లందరూ శివకేశవులను ఒకేసారి చూసి తమ జన్మలు తరించాయని ఆనందపడ్డారు.

కృష్ణుడు శివుడికి సాష్టాంగ ప్రణామం చేసి ఆయనను కీర్తించాడు. శివుడు చాలా సంతోషించి, కృష్ణుడి చేతిని తన చేత్తో పట్టుకుని ఇలా అన్నాడు:

"కృష్ణా, ఇదివరకే నువు తపస్సిద్ధిచేత నా నుంచి వరంగా ఒక కొడుకును పొంది ఉన్నావు. నేను పూర్వం కృతయుగంలో అనేక వందల ఏళ్ళపాటు ఒకానొక

లన్నీ చూసి, శివుడు చేసిన పనులను స్మరించుకుంటూ ఆనందం పొందాడు.

అతను మానససరోవరం ఉత్తర తీరాన దిగి, అక్కడి మునులందరి పరిచయం చేసుకుని, పన్నెండేళ్ళు తపస్సు చెయ్యడా నికి పూనుకున్నాడు. అతను ఫాల్గుణ మాసారంభంలో దీక్ష పుచ్చుకుని, కంద మూలాలు తింటూ పన్నెండేళ్ళపాటు తపస్సు కొనసాగించాడు. పన్నెండేళ్ళు పూర్తి అయాయి. ఆఖరు రోజున ఇంద్రుడూ, ఇతర దేవతలూ కృష్ణుణ్ణి చూడవచ్చారు. అతను ఏ ఉద్దేశంతో ఇంత దీర్ఘ తపస్సు చేశాడో వారికి అంతు బట్టలేదు.

సంకల్పంతో అతినిష్ఠగా తపస్సు చేశాను. అప్పుడు నాకు పరిచర్య చెయ్యటానికని హిమవంతుడు ఈడు వచ్చిన తన కుమార్తెనూ, ఆమె సఖీ జనాన్నీ సమర్పించాడు. నేను కూడా అందుకు అంగీకరించాను. ఆ సందర్భంలో మా ఇద్దరినీ కలపాలని నిశ్చయించి ఇంద్రుడు మన్మథుణ్ణి ప్రేరేపించాడు. ఆ మన్మథుడు నా మీదికి ఎత్తి వచ్చి, నేను సమాధిలో నుంచి బయటికి వచ్చే సమయంకోసం వేచివుండి, నా గుండెమీద మోహనాస్త్రం ప్రయోగించాడు. వెంటనే నాలో మన్మథ వికారం కలిగి నేను పార్వతికేసి చూశాను. ఆమె పులకించిన శరీరంతో చాలా అందంగా కనిపించింది. ఎందుకిలా అయిందా అని ఆశ్చర్యపడుతూ నేను చుట్టూ కలయజూశాను. తన దగ్గర వున్న ఆయుధాలన్నీ నాపైన ప్రయోగించటానికి సిద్ధపడిన మన్మథుడు కనిపించాడు. అటువంటి దుర్మార్గుణ్ణి చంపితే మాత్ర మేమిటని నేను అనుకుంటూండగా నా ఫాలనేత్రం నుంచి అగ్ని పుట్టుకొచ్చింది. మన్మథుణ్ణి శిక్షించవద్దనీ, ఆగ్రహించ వద్దనీ ఆకాశాన దేవతలు కేకలు పెడుతూండగానే, అగ్ని జ్వాలలు మన్మథుణ్ణి ఆవరించి, బూడిద చేసేశాయి. ఆ తరవాత బ్రహ్మ మొదలుగా గల దేవతలు వచ్చి, మన్మథుడు ముల్లోకాలకూ మేలు చేకూర్చేవాడని చెప్పగా, బ్రహ్మ ఉద్దేశానుసారం అతన్ని నీకు కొడుకుగా నిర్ణయించాను. అతనే ప్రద్యుమ్నుడు; నీకూ, రుక్మిణికీ కలిగిన తొలి సంతానం. నువ్విప్పుడు చేసిన తపస్సుకు ఫలితం ముందుగానే పొందావు.''

తరవాత శివుడు అక్కడ చేరిన మునులు మొదలైన వారిని పలకరించి, కృష్ణుణ్ణి శ్రీమన్నారాయణుడుగా భావించి పూజించమని చెప్పి, అంతర్థానమైనాడు. అతనితోబాటే పార్వతీ, విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ, నందీ, ప్రమథగణాల వారూ అంతర్థానమయారు. కృష్ణుడు కూడా బదరీ వనానికి తిరిగి వచ్చాడు.





# వంతుల అత్త-పంతాల కోడలు

శివపురగ్రామం వాడైన వెంకటరత్నం, ఒక సామాన్య కుటుంబీకుడు. అతడి తల్లి అలివేలుకూ, భార్య కోమలికీ క్షణం పడేది కాదు. కోమలికి పంతం జాస్తి. అలివేలు అన్నింటిలోనూ, కోడలితో వంతుకు వచ్చేది. ఒకసారి వెంకటరత్నం పెద్ద జబ్బుపడి లేచాడు.

"ఏమండీ, మనం తిరుమలకు వెళ్ళాలి. మీకు నయం అయిన వెంటనే దర్శనానికి వస్తామని మొక్కుకున్నాను,'' అన్నది కోమలి, వెంకటరత్నానికి అన్నం వడ్డిస్తూ.

ఆ పక్కనే చల్ల చిలుకుతున్న అలివేలు, ''అవున్రా బాబూ! నేనూ మొక్కుకున్నాను. అందరం కలిసి వెళ్ళొద్దాం,'' అన్నది.

తన వైద్యానికే చాలా డబ్బు ఖర్చయి వుండడంతో, ఆడవాళ్ళ మొక్కుల మాట విని వెంకటరత్నం అదిరిపడ్డాడు. అయితే, అత్తాకోడళ్ళు చెరొక దేవుడికీ మొక్కుకుని, చెరొక వైపుకూ పడమనందుకు సంతోషించాడు.

వెంకటరత్నం, తన స్నేహితుడి దగ్గిర అప్పుచేసి తెచ్చిన డబ్బుతో, తిరుమల యాత్రకు వెళ్ళారు. ముగ్గురూ మేనాలు మాట్లాడుకుని, కొండపైకి చేరారు. కొండ మీద వెంకటరత్నం కష్టాలు ప్రారంభమయాయి. కనిపించిన ప్రతి విగ్రహం దగ్గిర వున్న హుండీలో, భర్తను అడిగి డబ్బులు తీసుకుని వేయసాగింది, కోమలి.

కోమలి హుండీల్లో డబ్బు వేయడం చూసి, తనవంతు కొడుకు దగ్గిర వసూలు చేసి, తనూ హుండీల్లో వేయసాగింది, అలివేలు. ఇది చూసి కోపం వచ్చినా, వెంకటరత్నం వాళ్ళకు నచ్చచెప్పలేక, అడిగినప్పుడల్లా డబ్బు యిస్తూ వచ్చాడు.

మాచిరాజు కామేశ్వరరావు



దర్శనం అయ్యాక, వాళ్ళు తిరుగు ప్రయాణం అయ్యారు.

"మేనాలు మాట్లాడరా, బాబూ!" అన్నది అలివేలు అయాసపడుతూ.

"నా కాళ్ళు పీకేస్తున్నాయి!" అన్నది కోమలి, కాళ్ళు నొక్కుకుంటూ.

వెంకటరత్నం యిక కోపం అపుకోలేక, "ఇంకా నయం! మేళతాళాలు వద్దా? డబ్బంతా హుండీలలో నింపేశారు. నా దగ్గిర కానీ లేదు. కొండ కాలినడకన దిగవలసిందే," అన్నాడు.

"అదేం మాటరా బాబూ! ఆ సంగతి ముందే చెప్పొద్దూ," అన్నది అలివేలు కోపంగా.

"ముందు చెప్పివుంటే, మీ ముల్లేం పోయేది!" అంటూ మూతిముడిచింది, కోమలి.

"ఆడవాళ్ళకు మగవాడి సంపాదనా, అయ్యే ఖర్చుల గురించి తెలిసివుండాలి. తెమ్మనగానే నేను ఎక్కడి నుంచి డబ్బు తేగలనని, మీరు ఆలోచించవద్దా? అయితే పుణ్యం అనేది డబ్బు చెల్లించి కొనగలిగిన వస్తువుకాదు. మనస్సును నిర్మలంగా వుంచుకోవడాన్ని మించిన పుణ్యం లేదు. సరే, నడవండి!" అంటూ మెట్లు దిగడం ఆరంభించాడు, వెంకటరత్నం.

వాళ్ళు మిట్టమధ్యాహ్నం వేళకు, తమ ఇల్లు చేరారు.

"తొందరగా వంట చేయండి. ఆకలి దహించుకుపోతున్నది," అని తల్లికీ, భార్యకూ చెప్పి, వెంకటరత్నం ఏదో పని మీద ఊళ్ళోకి వెళ్ళాడు.

"తొందరగా వండి తగలడు. నాకు నీర సంగావున్నది," అన్నదిఅలివేలు,కోడలితో.

"ఆ మాటే నేను, మీతో చెబుతున్నాను. వంట త్వరగా చేయండి," అన్నది కోమలి.

ఆ అత్తాకోడళ్ళ మధ్య, అన్ని పను లకూ వంతులున్నవి. పొద్దుటిపూట వంట కోమలి చేస్తుంది. సాయంత్రం వంట అలివేలు చేస్తుంది. అయితే, అది మధ్యాహ్నం కావడంతో, ఇద్దరూ వంట

నువ్వు చేయాలంటే, నువ్వు చేయాలని వాదించుకుని, ఎవరూ చేయకుండా కూర్చున్నారు.

తర్వాత కొంతసేపటికి వెంకటరత్నం వచ్చి, వంట ఎవరూ చేయలేదని తెలుసుకుని, భార్యతో, "నువ్వు చిన్నదానివి! పెద్దవాళ్ళతో పంతం ఏమిటి? రాక్షసిలా దాపురించావు," అని, తల్లితో, "అమ్మా, నువ్వు పెద్దదానివిగదా. నీకు చిన్నవాళ్లతో వంతులెందుకు? మీ యిద్దరూ నన్ను కాల్చుకు తింటున్నారు! ఛీ, ఛీ," అంటూ, ఆ కోపంలో బయటికి వెళ్ళిపోయాడు.

అత్తగారిముందు, భర్త తనను తిట్టడం, భరించరాని అవమానంగా తోచింది, కోమలికి. కొడుకు తనను, కోడలిముందు అలా కసురుకున్నందుకు కోపం తెచ్చుకున్నది, అలివేలు.

కొద్దిసేపు తర్వాత, పుట్టింటికి పోవడానికి సామాను సర్దుకున్నది, కోమలి. రెండో కొడుకు ఇంటికి వెళదాం అని, తనూ సామాను సర్దుకున్నది, అలివేలు. కాకతాళీయంగా వాళ్ళు వెళ్ళవలసిన ఊరు ఒక్కటే.

"ఇంటికి పెద్దవారు. ఇంటికి తాళం పెట్టి, తాళంచెవి పక్కింట్లో యిచ్చే బాధ్యత, మీది!" అన్నది కోమలి.

"ఇల్లు నీదీ, బరువుబాధ్యతలు నావా? ఇది మరీ బావుంది. ఆ పన్లేవో నువ్వే చేసుకో!" అన్నది అలివేలు.






ఇద్దరూ కొంతసేపు వాదించుకుని, చివరకు ఇంటికి తాళం వేయకుండానే బయలుదేరారు. వాళ్ళు నాలుగు బజార్ల కూడలిలో కొంతసేపు ఎదురుచూశాక, ఒక గుర్రపుబండి వచ్చింది.

ఇద్దరు వెళ్ళవలసిందీ, ఒకే ఊరని తెలిసి, బండివాడు వాళ్ళను బండి ఎక్కి కూర్చోమన్నాడు. అత్తాకోడళ్ళిద్దరూ బండి ఎక్కి, వెనకవైపున పక్కపక్కన కూర్చున్నారు. బండి ఊరు దాటాక వాళ్ళల్లో ఒకరిని ముందుకు జరిగి కూర్చోమన్నాడు, బండివాడు.

"నేను ముందుకు జరగను. మీరు జరగండి!" అన్నది కోమలి.

"నే కదలను. కావాలంటే మువ్వే ముందుకు జరిగి కూర్చో." అన్నది అలివేలు మొండిగా.

ఇద్దరూ పంతంపట్టారు. బండివాడు పెద్దగా హెచ్చరిస్తున్నా వినిపించుకోలేదు. వేగంగా పోతున్న బండి కాస్తా, అత్తాకోడళ్ళ బరువుకు వెనక్కు లేచిపోయింది. వాళ్ళిద్దరూ పక్కనేవున్న నీళ్ళగుంటలో పడ్డారు.

తర్వాత యిద్దరూ మూలుగుతూ, నీళ్ళ గుంటలోంచి పైకి వచ్చి, ఆ పక్కనే వున్న చెట్టుకింద ఎడముఖం, పెడ ముఖంగా కూర్చున్నారు.

ఒక పావుగంట గడిచాక అలివేలు, బండివాడికి గుర్తులు చెప్పి, తన కొడుకును పిల్చుకురమ్మన్నది. వాడు మరొక అరగంట గడిచాక, వెంకటరత్నాన్ని వెంటబెట్టుకుని అక్కడికి వచ్చాడు.

కొడుకును చూస్తూనే అలివేలు, "చూడరాబాబూ, నా అవస్థ! నీ పెళ్ళాం పంతం, నా దుంపతెంపింది." అన్నది.

"నాతో వంతుపెట్టుకోవడం ఎందుకు? తను బండిలో కాస్త ముందుకు జరిగి కూర్చుంటే, యీ ప్రమాదం జరిగేదికాదు. అయ్యో, నా నడుం విరిగినట్టుగా వుంది!" అంటూ కోమలి జలజలా కన్నీళ్ళు రాల్చింది.

తల్లినీ, భార్యనూ యిలాంటి దీనస్థితిలో చూసిన వెంకటరత్నానికి, వాళ్ళ మీద చాలా జాలికలిగి, "జరిగిందేదో జరిగింది!" ఇప్పటికైనా మీరు బుద్ధి తెచ్చుకుంటే మంచిది," అన్నాడు.

అత్తాకోడళ్ళు తలలు వంచుకుని, కొంతసేపు మౌనంగా వూరుకున్నారు. వాళ్ళకు తమ పంతాల మీదా, వంతుల మీదా రోతకలిగింది.

"ఇంత జరిగాక బుద్ధి రాకపోతే, నేను మనిషినేకాను," అన్నది కోమలి.

"నేనూ అంతే! ఇంటికిపోదాం, బండిని వెనక్కు తిప్పించు," అన్నది అలివేలు.

"ఇంకా ఇల్లేమిటి? మీరిద్దరూ పంతాలూ, వంతులతో ఇంటికి తాళం పెట్ట లేదు. దొంగలు ఇల్లంతా దోచుకున్నారు. మీ ప్రయాణం ఆపడం ఎందుకు? వెళ్ళండి," అన్నాడు వెంకటరత్నం.

తమ మూర్ఖత్వంవల్ల, ఇంటిని దొంగలు దోచుకుపోయారని తెలిసి, అత్తాకోడళ్ళు విలవిలలాడి పోయారు.

"ఇదంతా నా బుద్ధితక్కువవల్లే జరిగింది. నా వంతుల జబ్బు కొంప ముంచింది," అన్నది అలివేలు, చీర కొంగుతో కళ్ళొత్తుకుంటూ.

"లేదు, అత్తయ్యా! దీనికంతా కారణం, నా అర్థం లేని పంతమే! అదే నా ఇంటిని గుల్లచేసింది," అన్నది కోమలి ముక్కుచీదుతూ.

ఇద్దరూ తప్పు నాదంటే నాదని వాద నకు దిగారు.

అది చూసి వెంకటరత్నం చిన్నగా నవ్వి, "మంచికయినా, చెడ్డకయినా పంతాలు, వంతులు మంచిది కాదు. మీలో నిజంగా మార్పు వచ్చిందో లేదో తెలుసుకునేందుకు, ఇల్లు దోపిడీ అయిం దని చిన్న అబద్ధం చెప్పాను. ఇద్దరూ తమలోని లోపాన్ని గుర్తించారు గదా? అదేచాలు, ఇక బండి ఎక్కండి. ఇంటికి పోదాం," అన్నాడు.

ఆ మాటలు అత్తాకోడళ్ళకు పరమా నందం గలిగించాయి.






# జలరాక్షసుడు

ఒకానొక దూరదేశంలో ఒక సరస్సుకు సమీపంలో ఒక కుటీరంలో ఒక పేదకాపు ఉండేవాడు. ఆ కాపుకు ముగ్గురు కొడుకులు. తల్లీ తండ్రీ పోయినాక పెద్ద వాళ్ళిద్దరూ ఏకమై ఉన్న కొద్దిపాటి ఆస్తినీ ఒడుచుకున్నారు.

"ఈ ఇల్లు నాది!" అన్నాడు పెద్దవాడు.

"ఇంట్లో సామానంతా నాది!" అన్నాడు రెండోవాడు.

"మరి నామాట ఏమిటి?" అన్నాడు మూడోవాడు.

"నీకా? ఇల్లూ, ఇంట్లో సామానూ పోగా ఏముంటే అది నీదే. వెతికి తీసుకో," అన్నారు అన్నలు.

మూడోవాడు ఇల్లంతా వెతికి ఒక మూల పడి ఉన్న తాటి చుట్ట సంపాదించాడు. దాన్ని వాడు తీసుకోవచ్చునని అన్నలు అనుమతించారు. ఆ తాడు భుజాన వేసుకుని కాపు కొడుకు సరస్సు తీరానికి వెళ్ళాడు. వాడక్కడ నీటి ఒడ్డునే పెరిగే ఒక చెట్టు నానుకుని కూచుని తనకు బతుకుతెరువు ఏమిటా అని ఆలోచిస్తుండగా అంత దూరాన ఒక ఉడత కనిపించింది.

తనవద్ద ఉన్న తాడుతో ఉచ్చులు పన్ని రకరకాల జంతువులను పట్టుకుని, వాటి చర్మాలు అమ్మి బతకవచ్చునని వాడికి తోచింది. వాడు వెంటనే ఉచ్చు పన్ని ఉడతను పట్టుకున్నాడు. అయితే తీరా పట్టుకున్నాక వాడికి దానిని చంప బుద్ధి కాలేదు. అందుచేత ఒక చెక్కల గూడు చేసి వాడు ఉడతను అందులో పెట్టాడు.

అలాగే వాడు కొంతసేపటికి ఒక కుందేలును కూడా ఉచ్చుల సహాయంతో

25–ఏళ్ళనాటి చందమామ కథ

పట్టుకుని దాన్ని కూడా చెక్కల గూడులో పెట్టేశాడు.

వాడు ఆ సరస్సు ఒడ్డునే మకాం పెట్టి తన తాడుకు చిన్న ఉచ్చులూ, పెద్ద ఉచ్చులూ, ఇంకా పెద్ద ఉచ్చులూ అమర్చసాగాడు. వాడు చూస్తూ ఉండగానే ఒక పెద్ద ఎలుగుబంటి వాడికి కొంచెం దూరంగా ఉన్న గుహలో ప్రవేశించింది.

కాపు కొడుకు ఇలా ఉచ్చులు అమర్చుతూ ఉండగా నీటి లోపల గలగల శబ్దం వినిపించింది. వాడు తల ఎత్తి చూసేసరికి నీటిలో నుంచి సగం పైకి వచ్చిన ఒక కుర్రవాడు ఒక రాయి పట్టుకుని దానిమీదుగా తనకేసి చూస్తూండటం కనిపించింది.

ఆ సరస్సు అడుగున ఒక జలరాక్షసుడుంటున్నాడు. వాడెప్పుడూ నీరు విడిచి బయటికి రాడు. కాని ఎవరైనా సరస్సు సమీపానికివస్తే తన మాయోపాయాలచేత వారిని నీటిలోకి వచ్చేలాగు చేసి లోపలికి ఈడ్చేస్తాడు. వాడు ఎందరో ప్రయాణీకులను ఆ విధంగా చంపేసి, అంతులేని బంగారం చేర్చిపెట్టాడని చెప్పుకునేవారు.

ఇప్పుడు తనను చూస్తున్నది ఆ జలరాక్షసుడి కొడుకై ఉండాలని కాపు కొడుకు గ్రహించాడు.




"మా సరస్సు దగ్గిర చేరి ఏం చేస్తున్నావు?" అని రాక్షసుడి కొడుకు అడిగాడు.

"ఈ సరస్సుకు ఉచ్చువేసి బిగలాగబోతున్నాను. అప్పుడు సరస్సు కాస్తా మూసుకుపోతుంది," అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు బుడుంగున మునిగి తండ్రి దగ్గిరికి పోయి కాపు కొడుకు అన్న మాటలు చెప్పాడు.

"అంత పని చేస్తాడుగా ? వాణ్ణి బతికి ఉండ నివ్వరాదు. నువు మళ్ళీ పైకి వెళ్ళి నీతోబాటు చెట్టు ఎక్కమని పందెం వెయ్యి. చెట్టెక్కి అలిసిపోయినాక వాణ్ణి నీటిలోకి తోసెయ్యి. మిగతాపని నేను




చూస్తాను,'' అన్నాడు రాక్షసుడు తన కొడుకుతో.

రాక్షసుడికొడుకు పైకి వచ్చి కాపు కొడుకుతో, ''నా తో బాటు చెట్టెక్కు చూస్తాం!'' అన్నాడు.

''నేను పని మీద ఉన్నాను, కళ్ళు కనపడటం లేదూ? కావలిస్తే నా చిట్టి తమ్ముడితో వెయ్యి పందెం,'' అంటూ కాపు కొడుకు చెక్కల గూడులో నుంచి ఉడతను వదిలాడు. రాక్షసుడి కొడుకు చెట్టుమీద చెయ్యి వెయ్యక ముందే ఉడత తుర్రున చిటారు కొమ్మకు పాకిపోయింది.

రాక్షసుడి కొడుకు మళ్ళీ తండ్రి దగ్గిరికి పోయి ఇలా జరిగిందని చెప్పాడు.

''అయితే వాణ్ణి నీతో పరుగుపందానికి రమ్మను. వాణ్ణి సరస్సు చుట్టూ పరిగెత్తించి, అలుపు రాగానే లోపలికి తోసెయ్యి,'' అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడి కొడుకు పైకి వచ్చి, ''పోనీ నాతో పరుగు పందెం వెయ్యి!'' అన్నాడు.

''కళ్ళు లేవూ? పని మీద ఉన్నాను. కావలిస్తే నా బుల్లి తమ్ముడితో వెయ్యి పందెం!'' అంటూ కాపు కొడుకు కుందేలును వదిలాడు. వదిలిందే ఆలస్యంగా అది వాయువేగంతో బయలు దేరి క్షణంలో మాయమయింది.

రాక్షసుడి కొడుకు మళ్ళీ తండ్రి దగ్గిరికి పోయి జరిగింది చెప్పాడు. ''అలాగా! ఇదేదో మహాచిత్రంగా ఉందే! అయితే ఈసారి మల్లయుద్ధం చేసి చితకగొట్టి నీటిలోకి తొయ్యి!'' అన్నాడు రాక్షసుడు.

వాడి కొడుకు పైకి వచ్చి కాపు కొడుకుతో, ''నాతో మల్లయుద్ధం చేస్తావా?'' అని అడిగాడు.

''చేతిలో పని ఇంకా పూర్తికాలేదు. ఆ కనిపించే గుహలో మా తాత ఉన్నాడు. ఆయనతో మల్లయుద్ధం చెయ్యి. నువు గెలిస్తే అప్పుడు నీ సంగతి నేను చూస్తాను,'' అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు ఎలుగుబంటి ఉండే గుహలోకి వెళ్ళి దాన్ని కవ్వించాడు.

ఎలుగుబంటి వాణ్ణి పట్టి పీకి, రక్కి వదిలి పెట్టింది. వాడు ఎలాగో చావు తప్పించుకుని పారిపోయి తండ్రిని చేరుకుని జరిగినదంతా చెప్పాడు.

జలరాక్షసుడికి భయం పట్టుకున్నది.

''వీడెవడో ఉద్దండుడల్లే ఉన్నాడే! వీడి తమ్ములు చెల్లెక్కటంలోనూ, వరి గెత్తటంలోనూ నిన్ను మించిన వాళ్ళంటివి! వీడి తాత నిన్ను చంపినంతపని చేశాడాయె! వీడు మన సరస్సును ఉచ్చువేసి నిజంగానే మూస్తాడేమో! ఎంత బంగారం ఇస్తే వీడు మన సరస్సును వదిలి పోతాడో అడిగిరా!'' అన్నాడు రాక్షసుడు కొడుకుతో.

వాడు వెళ్ళి కాపు కొడుకును అడిగాడు.

''నువు బంగారం తీసుకురా! చూసి చెబుతాను,'' అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు కొంత బంగారం తెచ్చాడు. అది చాలదన్నాడు కాపు కొడుకు. వాడు వెళ్ళి మరికొంత తెచ్చాడు. కాపు కొడుకు తృప్తిపడ లేదు. రాక్షసుడు ప్రాణం విసిగి తన దగ్గిర ఉన్నదంతా పంపేశాడు.

''ఇంతకంటె మా దగ్గిర చిన్నమెత్తు కూడా బంగారం లేదు!'' అని రాక్షసుడి కొడుకు చెప్పిన మీదట కాపు కొడుకు ఆ బంగారమంతా తీసుకుని తన తండ్రి ఇంటికి వెళ్ళాడు.

''ఎక్కడిదిరా నీ కింత బంగారం?'' అని అన్నలు ఆశ్చర్యంగా అడిగారు.

''ఈ తాడుతో సంపాదించుకున్నాను,'' అన్నాడు తమ్ముడు.

''ఈ ఇల్లూ, ఇంట్లో సామానూ తీసుకుని మాకు ఆ తాడు ఇచ్చెయ్యి,'' అని అన్నలు తమ్ముణ్ణి బతిమాలారు.

తమ్ముడు ఇచ్చేశాడు. వాడు తన తండ్రి ఇల్లు బాగుచేయించుకుని, తన బంగారంతో పొలాలూ, గొడ్డూ, గోదా ఏర్పాటుచేసుకుని సుఖంగా ఉన్నాడు.

వాడి అన్నలు ఆ తాడు తీసుకుని ఎటుగా వెళ్ళారో, ఏమైపోయారో ఈనాటికీ ఎవరికీ తెలియదు.





# పురోహితుడి యుక్తి

సురేంద్రనగర రాజవంశానికి జాధోజీ భట్టు అనే పురోహితుడు ఉండేవాడు. ఆయనకు తొంభై సంవత్సరాల వయసు వచ్చింది. ఆయన దివాణానికి వెళ్ళడం మానుకుని, ఏడాదికొకసారి వార్షికం పుచ్చుకోవటానికి మాత్రమే వెళుతూ ఉండేవాడు. ఆయన స్థానంలో ఆయన తమ్ముడి కుమారుడు వల్లభజీ అనేవాడు రాజపురోహితుడుగా పని చేస్తున్నాడు.

కొలువు మానుకున్నా జాధోజీభట్టుకు దివాణంవ్యవహారాలలోఆసక్తిఏమాత్రమూ తగ్గలేదు. రోజూ వల్లభజీ ఇంటికి రాగానే దివాణం విశేషాలు అడిగి తెలుసుకుంటూ ఉండేవాడు.

ఒక రోజు ఆయన పూజలో ఉండగా వల్లభజీ ఇంటికి వచ్చి, రాజకుమారులు తమ రాజ్యాన్ని పంచుకోబోతున్నట్టు చెప్పాడు. అది రెండు నగరాలూ పన్నెండు గ్రామాలూ గల ఆస్తి. సురేంద్ర నగరమూ, చూడా అనేవి నగరాలు. రాజకుమారుల పేర్లు అర్జనసింగూ, సబలసింగూ. వారిలో ఒకరికి ఒక నగరంతో బాటు ఆరు గ్రామాలూ, రెండోవాడికి రెండో నగరంతో బాటు మిగిలిన ఆరుగ్రామాలూ వస్తాయి. కాని ముఖ్యనగరమైన సురేంద్రనగరం తనకు కావాలని ఇద్దరు అన్నదమ్ములూ పట్టుదలగా ఉండటం చేత విభజన నిలిచి ఉన్నది.

జాధోజీభట్టు పూజముగించి లేచాడు. పెద్దవాడైన అర్జనసింగుకు సురేంద్రనగరం రావాలని ఆ వృద్ధుడి కోరిక. దాన్ని పెద్దవాడికి ఇచ్చి, రెండోవాడికి ఎలాగైనా చూడానగరం వచ్చేటట్టు చేయాలని ఆయన నిశ్చయించుకున్నాడు.

మర్నాడు ఉదయం ఆయన దివాణానికి వెళ్ళాడు. తలవని తలంపుగా

గుజరాతీ జానపద కథ

ఆయన వచ్చినందుకు అందరూ ఆశ్చర్య పడ్డారు. ఒక గదిలో రాజకుమారులు మాట్లాడుకుంటూంటే జాథోజీభట్టు అక్కడికి వెళ్ళాడు.

"శ్రమపడి మీరెందుకు వచ్చారు? కబురు పెడితే మేమే మీవద్దకు వచ్చి ఉండేవాళ్ళం గద!" అన్నారు రాజకుమారులు ఆయనతో.

"మీరు భాగాలు పడుతున్నారని విని మిమ్మల్ని ఆశీర్వదించిపోవటానికి వచ్చాను, నాయనలారా!" అన్నాడు జాథోజీభట్టు.

"భాగాలు ఎలా పడాలో ఇంకా నిర్ణయం కాలేదు. పెద్దవాణ్ణి గనక ముందు ఎన్నుకోవలసినది నేనే నంటున్నాను. కాని సబల్ చిన్నవాడికే ముందు ఎన్నుకునే హక్కు ఉంటుందంటున్నాడు. ఏది ఉచితమో మీరే చెప్పకూడదా?" అన్నాడు అర్జునసింగు.

"నేను ఎలా చెబుతాను? మీరిద్దరూ నాకు ఒకటే. అదీగాక రాచకార్యాలలో తల దూర్చటం నాకు ఇష్టంలేదు. నే నేదో రామాకృష్ణా అంటూ కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాణ్ణి." అన్నాడు జాథోజీభట్టు.

"కనకనే మీ నిర్ణయం మాకు అవసరం. మీరు ఎలా చేయమంటే అలా చేస్తాం." అన్నారు రాజకుమారులు.

"మీ కొక చిన్న కథ చెబుతాను. శ్రద్ధగా వినండి. పూర్వం ఒక ఋషి వద్ద ఇద్దరు శిష్యులుండేవారు. వాళ్లు పన్నెండేళ్ల



పాటు గురుశుశ్రూష చేసి ఆయన వద్ద నేర్చుకోదగినదంతా నేర్చుకుని, వెళ్ళి పోవటానికి గురువుగారి అనుమతి కోరారు. అప్పుడా ఋషి అగ్నికుండం నుంచి కొంచెం బూడిద తీసి, ఇద్దరు శిష్యుల చేతిలోనూ ఉంచాడు. ఒక శిష్యుడు వెంటనే ఆ బూడిదను నోట వేసుకుని మింగాడు. రెండోవాడు దాన్ని అవతల పారేశాడు. బూడిద మింగిన శిష్యుడు అఖండ పండితుడై సుఖంగా జీవించాడు. రెండోవాడు మందమతి అయిపోయి, తనకు సరిగా విద్య చెప్పలేదని గురువును నిందించాడు. అలా మీరు నన్ను నిందించకుండా ఉండేటట్టయితే మీరు భాగాలు పడటానికి నేను రేపు మీకు ఒక మార్గం చెబుతాను,'' అన్నాడు జాథోజీభట్టు.

రాజకుమారు లిద్దరూ పురోహితుడి మాటను ఆనందంగా అంగీకరించారు.

మర్నాడు ఉదయం ఆయన రాజభవనానికి వచ్చాడు. ఇతరులు ఎవరూ లేకుండా ఆయన వెంట రాజకుమారులిద్దరూ ఒక గదిలో చేరారు. జాథోజీభట్టు రెండు మడిచిన కాగితాలు తీసి, ''వీటి మీద సురేంద్రనగరం అనీ, చూడా అనీ రాశాను. మీ రిద్దరూ చెరొక కాగితమూ తీయండి. ఎవరికి ఏ నగరం పేరు గల చీటీ వస్తే ఆ నగరమూ, దానికి చెందిన ఆరు గ్రామాలూ తీసుకోండి,'' అన్నాడు.

అర్జనసింగు చప్పున ఒక చీటీ తీసి, దాన్ని విప్పి చూడకుండానే నోట్లో వేసుకుని మింగేశాడు.

సబలసింగు ఆశ్చర్యంతో, ''అందులో ఏమిరాసి ఉన్నదీ చూడలేదే!'' అన్నాడు.

''దానిదేముంది? నీ చీటీ మీద రాసి లేని నగరం నాదే గదా!'' అన్నాడు అర్జనసింగు.

సబలసింగు తన చీటీ విప్పి చూస్తే దాని మీద ''చూడా'' అని రాసి ఉన్నది. ఆ ప్రకారమే రాజ్యవిభజన జరిగింది. ముసలివాడు రెండు చీటీలమీదా "చూడా" అనే రాసి మోసం చేశాడని సురేంద్రనగరంలో ఇప్పటికీ చెప్పుకుంటారు.






పశ్చిమ ఆఫ్రికాకు చెందిన గోలియత్ జాతి కప్ప 81.5 సెం.మీ. (32.08 అంగుళాలు) వరకు పెరుగుతుంది. కప్పలన్నిటిలోకీ పెద్దదైన ఈ జాతి కప్ప 3,306 గ్రా॥ బరువుంటుంది.

స్టికిల్‌బాక్ మగచేప. ఆడచేపలు గుడ్లు పెట్టడానికి నీళ్ల లోపల గూళ్లు కడతాయి.







పరికరం ఉపయోగించే సస్తన జంతువులలో సీ ఆటర్ ఒకటి. సీ ఆటర్ వెల్లకిలా ఈదుతూ తన రొమ్ముమీద రాయిని పట్టుకుని గుల్ల చేపను కొట్టి తింటుంది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Pranlal K. Patel

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాస్-26

---

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మాతృ సన్నిధి! రెండవ ఫోటో: మైత్రి పెన్నిధి!!

పంపినవారు: సరిపల్లి లక్ష్మి, రాజానగర్ కాలనీ, కాకినాడ—533 004

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


### చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

